

పడవలో బాలురు

—ఫొటో: ఎస్. పరశురాం, నాసిక్.



# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

మిమ్మల్ని రోజంతా హాయిగా
మరియు సువాసన వెదజల్లుతూ
ఉంచుటలో సాటిలేనిది




నవోత్సాహమునిచ్చే, పరిమళముగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు వాడితే తీక్షణమైన ఎండతో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా. హాయిగా ఉంటుంది. ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటే చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు. రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడు పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరునే వాడండి.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో. యు.ఎస్. అమెరికాలో సంస్థాపితము)

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

**Founder: K. NAGESWARA RAO**

విలంబి పౌష్యం బహుళ చతుర్థీ బుధవారం

సంపుటము 58
సంచిక 18
**28-1-59**


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
పొన్నలూరివారి "దైవబలం" చిత్రంలో
జయశ్రీ





# రాజధాని కబుర్లు

## నాట్యకోవిదుడు కీ॥ శే॥ శాంతిబర్ధన్

అద్భుతం; ఈ పదాన్ని రాజధాని కబుర్లలో ఉపయోగించాను ఇదివరకు. తరుచుగా కాకపోవచ్చు. కాని చాలసార్లు ఉపయోగించాను. ఉపయోగించిన పదాన్ని ఉపసంహరించుకోడం సాధ్యంకాని పని సాధ్యం ఐతే- సిద్ధమే నేను ఉపసంహరించుకోడానికి.

గత వారంలో రెండురోజులు 'ఎగ్జిబిషన్ థియేటర్'లో బొంబాయికి చెందిన 'లిటిల్ బేలే' బృందం రెండు ప్రదర్శనలిచ్చింది. అద్భుతంగా - నిజంగా అద్భుతంగా - ఉన్నాయి ఈ ప్రదర్శనలు. ఈ ప్రదర్శనలు తిలకించడానికి రాజధాని పౌరులకు అవకాశం ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం వారిని అభినందిస్తున్నాను.

[illegible] కంపెనీవాళ్ళు పత్రికలలో ప్రకటించిన మాదిరిగా రంగస్థలంమీద ఒకచోట కాంతిని ప్రసారంచేసి, 'స్పాటు లైటు' వేశాం అనడం అలవాటు మనవాళ్ళకి. సెటింగులంటే రంగస్థలం అంటే అవకాశం ఉన్న చోటల్లా దీపాలు పొదగడం. సంగీతం అంటే తెరవెనుక మైక్రఫోను పెట్టి, దాని ముందు వయొలిన్ బిరబిరలాడించడం. మేకప్ అంటే పెద్దాళ్ళు, చిన్నాళ్ళు; హీరోలు, హీరోయిన్లు అందరు తెల్లగా, ఎర్రగా రంగులు పులుముకోడం.

తినడానికి తిండి లేకపోయినా (రంగస్థలం మీద!) బనారస్ సిల్కు చీరో - మరేదో - అటువంటిదే — కట్టుకొంటే కాని సేజ నాయకురాలు హీరోయిన్. ముసలాడి వేషం వేసేవాడికి గడ్డం తప్పదు. నలభై ఏళ్ళు దాటితే మీసం - అందులో బారు మీసం- తప్పదు. జబ్బుచేయడం అంటే టి. బి. పేషెంటులా దగ్గడం. కోపం అంటే అరవడం. ఏడుపుఅంటే బావురుమనడం. హాస్యంఅంటే రేలంగి పోజులు పెట్టడం.

పొరపాటున - లేకపోతే అలవాటు చొప్పున - రచయిత డ్రాయింగు రూమ్‌లో కథ నడిపితే - వెంటనే ఒక సోఫా సెట్టు, ఒక రేడియో సెట్టు, మూడుపక్కల మూడు తలుపులు, ఒక తలుపు దగ్గరొక టెలిఫోను, మరో తలుపుపక్కన మేడమెట్లు, వీలుంటే బాల్కనీ. ఆ డ్రాయింగురూమ్ లక్షాధికారిదైనా, సెకండు గ్రేడు గుమాస్తాదైనా సరే ఈ హంగులు కావలసిందే!

ఈ పద్ధతిని వదులుతున్నాయి మన ప్రదర్శనలు చాలవరకు.

నాకో అనుమానం ఉంది. మన మంత్రులు చాలమంది తరుచు నాటక ప్రదర్శనలకు అధ్యక్షత వహిస్తూంటారు. నాటకాల్లో డ్రాయింగు రూమ్స్ చూసి, ఎన్. జి. వో.లు హాయిగా సుఖంగా ఉంటున్నారని అనుకుంటున్నారేమో! ఈవిధంగా కూడా నాటకాల ప్రభావం జీవితంమీద పడవచ్చు.

* * *

మన నాటకప్రదర్శనలు లోపభూయిష్ఠంగా తయారు కావడానికి చాలా కారణాలు ఉన్నాయి. ప్రధాన కారణం - నాకు తెలిసినంతవరకు - నాటక కర్తలక్ష్యానికి గాని, నాటక రచనా ధోరణికి కాని - ప్రయోక్త కాని దర్శకుడు కాని ప్రాముఖ్యం ఇవ్వలేకుండా పోవడం. ప్రదర్శనయొక్క పరమావధి ఏమిటో గమనించలేక పోతున్నారు మన దర్శకులు. నాటకంలోని సంభాషణలను విడివిడిగా తీసుకొని, ఆ సంభాషణలు ఏ స్థాయిలో ఏవిధంగా పలకాలో నిర్ణయించుకొని తృప్తిపడుతున్నారు. ప్రదర్శన కాలానికి ఒక 'సౌండు సిస్టమ్' వాడు వచ్చి, మైకులు అమరుస్తాడు. మరో కంపెనీవాడు వచ్చి దీపాలు పెడతాడు. ఆకాశవాణిలోనో మరెక్కడో పనిచేస్తూన్న ఒకరిద్దరు వచ్చి నేపథ్య సంగీతం పేరిటఒకటి రెండు వాయిద్యాలు వాయిస్తారు.



కీ॥ శే॥ శాంతిబర్ధన్

నాటకం ఐపోతుంది. బాగుంటే, ప్రేక్షకులు కరతాళధ్వనులుచేస్తారు. బాగుండక పోతే — ఐపోయినందుకు కరతాళధ్వనులు చేస్తారు. పత్రికలో నాటకంపై విమర్శలు పడితే —'ఈ విమర్శకులకు బుద్ధిచెప్పేలా ఒక నాటకం వేస్తాం ఉండండి' అంటూ కాలర్ ఎత్తుకు తిరుగుతారు నిర్వాహకులు.

* * *

నటీనటుల నటన, రంగస్థలాలంకరణ, నేపథ్యంనుండి సంగీతం, తెరముందునుంచి కాంతికిరణప్రసారాలు ఇవన్నీ ప్రదర్శనలో భాగాలు. ప్రదర్శన లక్ష్యాన్ని ఇవన్నీ ప్రతిబింబించాలి. ఇందులో ఏదీకూడా — 'నేనున్నాను సుమా ఇక్కడ' అని ప్రేక్షకులకు తెలియచేయకూడదు. 'ఫలానావాడు చక్కగా నటించాడు' అంటే, నటించిన సంగతి ప్రేక్షకుల దృష్టికి తీసుకురాబడింది కనుక - అంతవరకు ప్రదర్శన విఫలమైందన్న మాట. ఈ విషయం ప్రయోక్తలు గుర్తించాలి.

ప్రయోక్త ఈ విషయాన్ని గుర్తించడంవల్లనే, లిటిల్ బేలే

#  రాజధాని కబుర్లు 

బృందం సమర్పించిన రెండు ప్రదర్శనలు హృదయంగమంగా ఉన్నాయి. రకరకాల రంగులు రంగస్థలంపై కలిసిపోయి, ప్రేక్షకులకు నేత్రానందం కలిగించాయి. స్పాట్ లైట్లు కేవలం స్పాట్ లైట్లుగా దర్శనమీయలేదు. బేలేలో నటీనటుల నటనలభంగిమల ననుసరించి నేపథ్య సంగీతం ఉండడం సహజమే కాని, ఇంత చక్కగా సమన్వయం కుదరడం ఈమధ్యన నేనెక్కడా చూడలేదు.

ప్రదర్శనకు చెందిన వివిధశాఖల మధ్య ఇంత చక్కని సమన్వయం కుదరడం ఏవిధంగా సాధ్యమైంది? 'మాది లిటిల్ బేలే బృందం అనకండి: లిటిల్ బేలే కుటుంబం అనండి' అంది మిసెస్ శాంతి బర్ధన్ నాతో. వారు బొంబాయికి మరో గంటలో మరలిపోతున్నారనగా, మేనేజర్ శ్రీ ఆచార్యతోను, కార్యదర్శిని మిసెస్ శాంతి బర్ధన్‌తోను ఒక పావుగంట కాలం గడిపాను. లిటిల్ బేలే బృందం స్థాపకుడు కీర్తిశేషుడు శాంతి బర్ధన్ గురించి ప్రసంగించారు వారిరువురు.

1914 లో బెంగాల్ లో జన్మించాడు శాంతి బర్ధన్. నలభైసంవత్సరాల వయస్సులో 1954 సెప్టెంబర్ లో మరణించాడు. అతని 35 వ సంవత్సరంలో అతన్ని క్షయవ్యాధి పీడించింది. రెండుసంవత్సరాలు బాధపడ్డాడు. 1951 లో అతడు ఆసుపత్రి నుంచి తిరిగి వచ్చేసరికి, అతని శరీరంనుంచి తొమ్మిది పక్క ఎముకలు తొలగించబడ్డాయి. తర్వాత అతడు మూడు సంవత్సరాలు జీవించాడు. లిటిల్ బేలే బృందానికి నృత్యంలో శిక్షణ ఇవ్వడం మానలేదు. కాని అతగాడు నృత్యం చేయలేకపోయాడిక. ఒక కుర్చీలో కూచొని కరచరణ భంగిమలు చూపి నృత్యంలో శిక్షణ ఇచ్చేవాడు.

శాంతి బర్ధన్ ఒక పేదకుటుంబంలో, ఒక పేద కుటుంబంలో జన్మించాడు. మణిపూర్ నృత్యవిధానంలో పన్నెండుసంవత్సరాలుశిక్షణ పొందాడు. అతనికి గురువు అమూచీ సింగ్. 1938 సం॥లో మొదటిసారిగా ఒక బృందాన్ని సిద్ధంచేసి ప్రదర్శనలిచ్చాడు. 1940లో ఉదయశంకర్ నృత్యశిక్షణ కేంద్రంలో చేరాడు. ఆల్మోరా కేంద్రం మూసి వేయబడ్డప్పుడు బొంబాయి మరలివచ్చాడు. ప్రఖ్యాతహిందీ కవి సుమిత్రానందన్ పంత్ ప్రోద్బలంవల్ల ఇండియన్‌పీపుల్స థియేటర్స సెంట్రల్ స్క్వాడ్‌లో చేరాడు. బెంగాల్ కరువుగాథల్లో 'అమరభారతం' వంటి బేలేలను, రవి శంకర్ సంగీత దర్శకత్వం క్రింద సిద్ధంచేసి ప్రదర్శించాడు.

1946లో కాబోలు వ్యయభారాన్ని వహించలేక ఈ బృందం పని మానుకోవలసి వచ్చింది. అప్పుడు ఇండియన్ నేషనల్ థియేటర్స ఉద్యమంలో చేరి పండిట్ నెహ్రూ రచించిన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' బేలేగా రూపొందించాడు.

తరవాత మూడు సంవత్సరాలకి వ్యాధిపీడితు డయ్యాడు. వ్యాధిగ్రస్తుడై, శయ్యాగతుడై కూడా, మొన్న లిటిల్ బేలే బృందం ప్రదర్శించిన 'రామాయణ్' పప్పెట్ డ్రామాకు రూపకల్పన చేశాడు. 1954 ప్రారంభంలో 'పంచతంత్ర' ప్రారంభించి, పూర్తి కాకుండానే సెప్టెంబర్ లో మరణించాడు.

*          *          *          *

లిటిల్ బేలేబృందం తరువాత 'పంచతంత్ర' పూర్తిచేసి ప్రదర్శనలు ప్రారంభించింది. 'నగరంలో ఇరవైనాలుగు గంటలు' వంటివి మరికొన్ని ప్రదర్శనలు ఈ బృందం సిద్ధంచేసింది.

ఈ బృందంలో 27 గురు సభ్యులున్నారు. ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతాలనుంచి తప్పిస్తే; అన్ని భాషారాష్ట్రాల ప్రతినిధులున్నారు. అందరూ కలిసిఉంటారు. కలిసి పనిచేస్తారు. ప్రదర్శన వెనుక కావలసిన హంగులన్నీ 'నీవు-నేను' అనకుండా తామే సమకూర్చుకుంటారు. ఈ బృందం రష్యాలో, చైనాలో, జర్మనీలో ప్రదర్శనలిచ్చింది. దేశానికి పేరు ప్రఖ్యాతులు తెచ్చింది.

## వంగొప్పెబో! సాంస్కృతిక ప్రదర్శనలు

లిటిల్ బేలే వారి ప్రదర్శనలు తిలకించడానికి రాజధాని పౌరులకి అవకాశం కల్పించిన సంస్థ ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం. జనవరి 2 వ తేదీన ప్రారంభించి ఫిబ్రవరి ఏడు వరకుఅనేక ప్రదర్శనలు ఏర్పాటుచేసిందిఈ సంస్థ.



ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం కార్యదర్శి శ్రీ మామిడిపూడి ఆనందం

ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం అధ్యక్షులు డా. మర్రి చెన్నారెడ్డి, కార్యదర్శి, శాసనమండలి సభ్యుడు శ్రీ మామిడిపూడి ఆనందం, ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీ ఎ. ఆర్. కృష్ణ.

రాష్ట్రమంతటా గ్రామ గ్రామాల్లో అనేక సాంస్కృతికోత్సవాలు జరుగుతున్నాయి. ఈ ఉత్సవాల వెనుకఉన్న ఉత్సాహాన్ని కేంద్రీకృతంచేసి, దాన్ని వినియోగించుకోవలసిన బాధ్యత నాటక నాట్యసంస్థల సమాఖ్యగా పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘానిది. ఈ నాట్య సంఘానికి మరోపేరు థియేటర్ సెంటర్ !

నాట్యసంఘం పేరెక్కని తన బాధ్యతను గుర్తెరిగి పనిచేస్తూంది అనడానికి నిదర్శనాలు నేటి ఉత్సవాలు. తాను ఉత్సవాలను నిర్వహించుకోవడమే కాక అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనసంస్థను, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని, ఆంధ్ర నాటక కళాపరిషత్తును కలుపుకొని పనిచేస్తున్నందుకు నాట్యసంఘాన్ని అభినందించాలి.

ఉత్సవాలలో కార్యక్రమాలన్నీ బాగానే ఉన్నాయనుకోడం పొరపాటు. మొదట లలితారావు (మదరాసు) నాట్యంతో ప్రారంభం ఐంది కార్యక్రమం. ఈమె అనేక చలనచిత్రాల్లో నటించినదట. భరతనాట్యం పేరుచెప్పి సినిమా నాట్యప్రదర్శనం చేసింది. ఎంకిపాటలలో ఒక పాటకు నాట్యమాడి, నండూరివారి ఎంకిలో కవిత్వం అనేది లేదని రుజువుచేసింది. ఒకానొక ప్రదర్శనంలో భావప్రకటన అంటూ చేసి, ప్రార్థించవలసినచోట ఆగ్రహం కోపగించుకోవలసినచోట ఆనందం వ్యక్తంచేసి చూపించింది.

సినీనటి ఉన్నారు కాబట్టి ఏవిధంగా చేసినా దోషంలేదు-

ఈమె నాట్యానికి పాటపాడిన పెద్దమనిషి తెలుగును తమిళ భాషగా మార్చిపాడేశాడు. మదరాసులో అయితే చప్పట్లవర్షం కురిసేదేమో ! హైదరాబాదు పౌరులు నిశ్శబ్దంగా చూసి బాధపడ్డారు. ఆయన లాగానే 'మగాప్రభో!' అంటూ దేవుణ్ణి తలచుకున్నారు.

ఈ ఉత్సవాల సందర్భంలో జరిగిన ప్రదర్శనల్లో మెచ్చుకోతగిన వాటిలో ఒకటి కుమారి రత్నపాప నృత్యప్రదర్శనం. లలితా రావు నాట్యంలో లేని విలాసం రత్నపాప నాట్యంలో కనుపించింది. 'నటనమాడెనాపు' అంశం ప్రత్యేకంగా బాగుంది. శ్రీమతి సీత పాడిన 'మొక్కజొన్న తోటలో...' పాటకు భావవ్యక్తీకరణ బాగుంది. అన్ని అంశాలు మెచ్చుకో దగినవి లేకున్నా, కొన్ని అంశాలు చాలా బాగుండి, ప్రేక్షకులకు అహ్లాదం చేకూర్చాయి.

## 'రోడ్డు పక్క రోమియోలు'

చాకలాళ్ళు అనూయ పడదగిన తెల్లటి బట్టలు, హెయిర్ కటింగు సెలూన్‌వారు ఈర్ష్యపడేటట్టు నున్నగా దువ్విన జుట్టు, పానీ దుకాణాల వాళ్ళు కలిసి ప్రైజ్ లిచ్చేటట్టు నోట్లో సిగరెట్టు. ఎలక్ట్రిక్ బల్బులుకూడా మండిపోయేటట్టు మెదడులో శూన్యం.

ఇటువంటి విగ్రహాలను మీరు రాజధానినగరంలో చూశారా? చూసే ఉంటారు. సందుగొందుల్లోను, కార్పొరేషన్ పంపు దగ్గర, ఆడపిల్లల స్కూలుదగ్గర సుల్తాన్ బజార్ చౌరస్తాలోను కనిస్తాయి ఈ విగ్రహాలు.

విలియం షేక్స్పియర్ ఆత్మ ఉలిక్కిపడేవిధంగా, వీటిని 'రోడ్డుపక్క రోమియోలు' అని పిలుస్తూంటారు జనం.

ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి ముందు ఇటువంటివారు నగరంలో లేరని కాదు కాని, 1956 తరువాత నగరంలో అన్ని ప్రాంతాలకూ వ్యాపించారు వీరు. ఏ బీకామ్ పరీక్షో ఫెయిలవడం; కాకి అరుస్తే అమ్మనికౌగలించుకొని నేటం తినమతతో ఇంట్లో మెలగడం, నగరంలో ఆసుపత్రులలో పనిచేసే నర్సుల వెంట పడడం వీళ్ళకి అలవాటు.

కళాశాలలకిపోయే విద్యార్థినుల వెనువెంట నడుస్తూ అశ్లీల సంభాషణలద్వారా తమలోని మొరటుతనాన్ని బహిర్గతం చేయడం; బస్సుల్లో ప్రయాణంచేసే స్త్రీలవెంటబడి అల్లరిచెయ్యడం వీళ్ళకు మరో అలవాటు.

రోడ్డుప్రక్క రోమియోల బాధ ఈమధ్య భరించరానిదైంది. రోడ్డుపక్క జాలీటుటు వెనుక వీరు తిరుగాడినంతకాలం సమాజం చూస్తూ ఊరుకోడంతప్ప మరేమీ చేయలేదు. గౌరవ కుటుంబాలలో జనించి, రాజ్యాంగం తమ కిచ్చిన హక్కులను కాపాడుకుంటూ విద్య నభ్యసించడానికి పోయేబాలికలను అగౌరవపరచడం సహించరానిది.

గతవారం నారాయణగూడా బాలికల పాఠశాలవద్ద పదుగురు రోమియోలు అరెస్టు చేయబడ్డారు. పదుగురిలో నలుగురు కాలేజీ విద్యార్థులు. వీరు తర్వాత బెయిలుపైన తాత్కాలికంగా విడుదల చేయబడారు.

పోలీసుశాఖ దృష్టి వీరిపై, ఇటువంటివారిపై, కేంద్రీకరించ బడిందని పోలీసు కమీషనర్ శ్రీ విజయరంగం మొన్న నాతో అన్నారు. రోడ్డుపక్క రోమియోల ప్రవరనుగురించి కొన్ని ఫిర్యాదులొచ్చాయని, పోలీసుశాఖ తీసుకొనే చర్యల్లో మొన్నటిది మొదటిదని శ్రీ విజయరంగం అన్నారు.




పొలంనుంచి

—చిత్రం: ఎమ్. ధనం.

సమాజ శ్రేయస్సుదృష్ట్యా పోలీసుశాఖ తీసుకునే చర్యలకి, ప్రజల, పత్రికల సంపూర్ణ సహకారం ఉంటుందని ప్రత్యేకంగా హెచ్చరించవలసిన అవసరం ఉండదుగదా?

'రోడ్డుపక్క రోమియోల' బాధలకు గురౌతున్న బాలికలు, స్త్రీలు పోలీసుశాఖకు ఫిర్యాదులు పంపవచ్చు. పేర్లు తెలుసునంత వరకు ఫిర్యాదుల్లో తెలుపవచ్చు. సమాచారాన్ని రహస్యంగా ఉంచి, పోలీసుశాఖ గూఢచారులద్వారా సమాచారసేకరణ చేస్తుందనడంలో సందేహం లేదు.

## 'సేజి విలనులు': (3) స్పాట్ లైట్ !

టెలిఫోన్ కథలో ఉంటేకాని, నాటకంలో కనపడదు. మైక్ నటీనటుల నటనకు పేరర్థాలు చూపిస్తూంటుంది. కాని స్టేజి విలన్ నంబర్ వన్‌గా పేర్కొన తగింది స్పాట్‌లైట్. అది ఒడిగట్టిన దుర్మార్గాలకు మరే విలన్లు ఒడిగట్టలేవు.

(62-వ పేజీ చూడండి)




# పంచవర్షప్రణాళిక కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికా?

రిపబ్లిక్ దినోత్సవం కోసం భారత రాజధాని అందంగా అలంకరించుకుంటోంది; వయసు మళ్ళిన ఆడది మొహానికి దట్టంగా రంగు పూసుకున్నట్టు, బట్టలకి దట్టంగా అత్తరు రాసుకున్నట్టు తయారవుతోంది. సచివాలయం తాలూకు రెండు భాగాల గోడలూ రాష్ట్రపతి భవనానికి ఎదురుగా ఉన్న వేపున మాత్రం కలకలలాడుతున్నాయి. మిగతా వైపులగోడలు యథాప్రకారం వెలవెల బోతున్నాయి. సచివాలయంలోపలకూడా రోజు రోజుకీ మురికి ఎక్కువై పోతోంది. అశ్రద్ధ మూలంగా లోపలిభాగం పాడైపోతోంది. డబ్బు ఖర్చుకి భయపడి కాదు బాగుచేయించకపోవటం. బాగు చేయించటానికి మంజూరైన డబ్బు పైసా మిగలకుండా ఖర్చవుతూనే ఉంది. పనిమాత్రం జరగటంలేదు. భారతదేశం అనుసరిస్తున్న శ్రేయోరాజ్య విధానం ఫలితమే ఇది.

పనివారిలో క్రమశిక్షణ, సమర్థత నానాటికీ తగిపోతోంది. ఈ విషయమై కేంద్ర సచివాలయంలో చాలా కాలంగా పని చేస్తున్న ఉద్యోగస్థులతో నేను అప్పుడప్పుడు ముచ్చటిస్తూ వచ్చాను. క్రమశిక్షణ, సమర్థత తగ్గిపోవటమే కాదు. దేశంమీద అభిమానం, ప్రభుత్వం పట్ల విధేయతకూడా నానాటికీ తీసికట్టుగా ఉన్నాయని వారు చెబుతారు. "పూర్వం ఉద్యోగస్థుల కొడుకులకు, చుట్టాలకు ఉద్యోగాలు ఇవ్వటానికి సందర్భాలలో కొన్ని సదుపాయాలుండేవి. అందుచేత ఉద్యోగస్థులు పనిమీద శ్రద్ధ చూపించే వారు, ప్రభుత్వంమీద అభిమానం చూపించే వారు. రక్షణశాఖ ఉద్యోగస్థుల విషయం కూడా ఇంతే. అదిగాక ఉద్యోగస్థుల్ని బయటివారెవరైనా విమర్శిస్తే ప్రభుత్వం ఉద్యోగస్థులనే సమర్థించేది. ఇందువల్ల ఉద్యోగస్థులు స్వతంత్రించి ధైర్యంగా పనిచెయ్యటానికి వీలయ్యేది. ఇప్పుడదంతా పోయింది. ఎంతకాలంనుంచో పనిచేస్తున్న శ్రీ హెచ్. ఎమ్. పటేల్. జి. కామత్ గార్ల సంగతేమైందో తెలుసుకదా" అని ఒక పెద్ద ఉద్యోగస్థుడు నాతో అన్నాడు

సమర్థత విషయం చూదాం. ఎంప్లాయ్మెంట్ ఎక్స్ఛేంజీల ధర్మమా అని సమర్థత పూర్తిగా రూపుమాసిపోయింది. పేరు నమోదుచేసిన అభ్యర్థులను వరసగా తీసుకుని ఉద్యోగాలిచ్చేస్తుంటే సమర్థత ఏముంటుంది? యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ సంగతీ అధోగతిగానే ఉంది. ఇంటర్వ్యూకి హాజరుకాని అభ్యర్థులకు ఉద్యోగాలిచ్చిన సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయి.

సామ్యవాదం ఆచరణలో కొచ్చేసరికి అధికారుల పరిపాలనగా మారుతుంది. అందుచేత సామ్యవాదంమీద భారత ప్రభుత్వానికి నిజంగా నమ్మకంఉంటే ఉద్యోగస్థుల సమర్థతను పెంపొందించాలి, గాని నాశనం చెయ్యగూడదు.

* * *

భారతదేశ ప్రాచీన చరిత్రనుగూర్చి, హిందువుల శిలసంపదనుగూర్చి కొత్త విషయాలు తెలిపే పుస్తకాలు ఈమధ్య కొన్ని వచ్చాయి. మేజర్ జనరల్ జె. ఎఫ్. సి. ఫులర్ ఇటీవల ఒక గ్రంథంరాశారు. దాని పేరు "అలెగ్జాండర్ యుద్ధనీతి" (ది జనరల్ షిప్ ఆఫ్ అలెగ్జాండర్ ది గ్రేట్) అందులో ఆయన ఇలా వ్రాశారు:—

"అలెగ్జాండర్ యుద్ధసన్నాహాలు చేసున్న సమయంలో శిశుపుడనే రాజు అతని పక్షం చేరాడు. ఈ శిశుపుడు గాంధారరాజు. గాంధారం కుబార్, సింధు నదులమధ్య ఉన్నది. పురుషోత్తముని పై ద్వేషంతో తక్షశిల రాజు గ్రీకులతో కలియదలచాడని శిశుపుడు అలెగ్జాండరుతో చెప్పాడు."

పురుషోత్తమునితో యుద్ధం చేసిన సందర్భంలో అలెగ్జాండరు సైన్యంలో 5000 మంది భారతీయులు ఉండేవారని కూడా ఈ గ్రంథంవల్ల తెలుస్తోంది.

పూర్వం భారతప్రభుత్వం క్రింద కార్యదర్శిగా పనిచేసిన సర్ ఒలాఫ్ కారో కొత్తగా "పఠాన్స్" అనే పుస్తకం వ్రాశారు. అందులో ఒకచోట ఇలా ఉంది:...

"హిందూరాజు జయపాలుణ్ని మహమూద్ గజినీ ఆఖరుసారిగా ఓడించిన యుద్ధభూమి సరిగా ఎక్కడుందో తెలియదుగాని పెషావరుకు దగ్గర్లోనే ఉండి ఉండాలి. ఈ యుద్ధం క్రీ. శ. 1000 లో జరిగింది. తరువాత కొద్ది సంవత్సరాలకి 1008 వ సంవత్సరంలో జయపాలుడి తరవాత రాజ్యానికి వచ్చిన ఆనందపాలుడితో గజినీ యుద్ధం చేశాడు. కాని ఈ యుద్ధంలోకూడా హిందూరాజే ఓడిపోయాడు. రాజపుత్రుల ధైర్య సాహసాలు కొర



భారతదేశంలో పర్యటించవచ్చిన యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, ఆయనసతి, వారికి ఢిల్లీ విమానాశ్రయంలో స్వాగతమిచ్చిన రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

గాకుండా పోయాయి. గజనీచేతుల్లో ఓడిపోయిన వారిలో పలువురు పెషావరులోయలోని గాంధారానికి చెందినవారే నవటంలో సందేహంలేదు. ఆ కాలంలో వేలాదిహిందువులు ఇస్లాం పుచ్చుకోవటంకూడా జరిగింది. అల్ బిరూనీ తన చరిత్రలో ఆనందపాలుణ్ని మెచ్చుకుంటూ "ఆనందపాలుడు గజనీ మహమ్మద్‌కు రాసిన ఉత్తరంలో ఒక భాగం నాకు చాలాఇష్టం. ఆనందపాలుడు ఇలా వ్రాశాడు:

'తురుష్కులు మీపై తిరుగుబాటు చేశారనీ, ఖురాసాన్‌దాకా వారు చొచ్చుకుపోతున్నారనీ విన్నాను. మీరు కావాలంటే మీకుతోడుగా 5 వేలమంది అశ్వికులతోను, 10 వేలమంది పదాతి సైనికులతోను నూరు ఏనుగులతోనూ రాగలను. ఇంకా కావాలంటే ఇంతకు రెట్టింపు సేననిచ్చి నా కుమారుణ్ణి పంపించగలను. మీ అనుగ్రహం సంపాదించాలని కాదు నేనీ పనిచేసేది. నేను మీ చేతులో పరాజితుణ్ణయ్యాను. మీరు మరొకరి చేతులో పరాజితులవటం నాకిష్టంలేదు.'

ఆ తరవాతనే భారతదేశంలో వెయ్యేళ్ళ బానిసతనం ప్రారంభమైంది.

అలెగ్జాండరు తన శత్రువులనుకూడా గౌరవించేవాడని జనరల్ ఫులర్ మెచ్చుకున్నారు. గౌరవించటం, అగౌరవించటం శత్రువునిబట్టికూడా ఉంటుంది. ఢిల్లీ పాలించిన ఆఖరి హిందూరాజు పృథ్వీరాజుకూడా మహమద్ గోరీని గౌరవించాడు. గోరీని స్వదేశానికి సురక్షితంగా పోనిచ్చాడు. కాని గోరీ పృథ్వీరాజును ఓడించినప్పుడు పరమ కిరాతకంగా ప్రవర్తించాడు. పృథ్వీరాజు యుద్ధభూమిలో మరణించాడు. కనీసం పృథ్వీరాజు కుటుంబం మీదకూడా గోరీ కనికరం చూపలేదు.

* * *

తీర్మానాలమీద తీర్మానాలు చెయ్యటం, బల్లలు విరిగిపోయేట్లు గుద్దిఉపన్యసించటం, గొంతులు చించుకుని వివాదాలు చెయ్యటం—వీటితోనే సమస్యలన్నీ పరిష్కారం అయిపోయేట్లయితే భారతదేశం ఈ పాటికి భూలోకస్వర్గమై ఉండేది. ఈ తీర్మానాలు అకౌంటులేని బ్యాంకికి రాసిచ్చిన చెక్కులాంటివి. నాగపూరు కాంగ్రెసులో చేసిన తీర్మానాలతో దారిద్ర్యం నిర్మూలనమైపోతుందని కొందరు అశాభావం వెలిబుచ్చారు. మంచిదే. అంతకంటే ఏం కావాలి? కాని తీర్మానాలు చేసేస్తే చాలా, వాటిని అమలు చేయనక్కరలేదా అని ప్రశ్న. తీర్మానాలనుఅమలుచేయటంకూడాఅవసరమే అయ్యేట్లయితే ప్రభుత్వం 'అమలు చెయ్యండోయ్' అనిఫర్మానాలుపంపినంత మాత్రాన అమలు జరిగిపోతుందా, ప్రజలు చెమటోడ్చి కష్టపడి పని చెయ్యనక్కరలేదా అని ప్రశ్న. కష్టపడి పని చెయ్యటమంటే ఎవరికీ గిట్టదు. కాంగ్రెసు వాదులకు దేశాభిమానం కంటే తమ పలుకుబడిమీద అభిమానమే ఎక్కువగా కనిపిస్తోంది. రెండవ ప్రణాళిక కాలంలో వ్యవసాయానికి పట్టిన దుర్గతిచూస్తే ఈ సంగతి తెలుస్తుంది. చెరకు పంటకు అధికోత్పత్తి ఉద్యమం అంటూ ఏమీ లేదు. అయినా చెరకు

(62-వ పేజీ చూడండి)

# సమర్పణ

## కందుకూరి లింగరాజు

(గతసంచిక తరువాయి)

### 6

పొటిగా, ఎర్రగా మధ్యపాపిడ, దవ్వెడి అంత కుంకపు బొట్టు, తెల్లారంకు కుచ్చిళ్ళు గోచీపోసి చీరకట్టుకని, నున్న మామిడి చెటులా వున్న రమణమ్మ అరోకొనుకుంటూ వీధిబడిలో చదివింది. ఇంట్లో అన్నగారివద్ద ఏ, బి, సీ, డీలు నేర్చుకుని పుస్తకాలు చదవడం వరకూ వచ్చింది. తండ్రి వెంకట్రామయ్యకు అంతగా పూర్వాచారాలు లేకపోవడం దానికితోడు ఇంట్లోవున్న వాళ్ళందరూ కూడా కొత్త అభ్యుదయ మార్గంలో మెలిగే పెద్దవాళ్ళవడం జరిగింది.

'వర్ణాశ్రమ ధర్మాలు అంటారు, ఆ ఆ వర్ణాలు సక్రమంగా జరుగుతుంటే పాటించడంలో సబబు వుంది. అవి ఎప్పుడైతే విచ్చిన్నమయ్యాయో, అప్పటితో చేసరి పాటించడం దాంతో ఆచారాలు కూడాను. ఏదో పాటించి అమలులో పెట్టకపోతే, నరకంలోకి వెళుతామని, ప్రాయశ్చిత్తం చేయించుకోవాలని అనుకోడం వరిమూర్ఖ్యం. 'దేవుడి దృష్టిలో అంతా ఒకటే' అన్న దృక్పథంలో వెంకట్రామయ్య మాట్లాడ్డం సర్వసాధారణమైన విషయమే. ఈ విషయమంతా ఆ చెట్టుక్రింద పేడరీకట కోసం అని అనుకున్నారు కొందరు. మరికొందరు నక్కజిత్తులే అన్నారు. ఏవి భిన్న అభిప్రాయాలను ఎందు వ్యాపింపజేసినా వెంకట్రామయ్య ఉద్యోగ ధర్మరీత్యా, ఏ కడజాతివాడైనా వస్తే భేదం లేకుండా దానా చెయ్యడం, ఇతర వర్ణాలవారికి ఎవరికో ఒకరికి రోజూ భోజనం పెట్టించడం జరుపుతూ వుండేవాడు.

దీంతో మొదట్లో ఎలా వున్నా కాలక్రమేణా వెంకట్రామయ్య అంటే ఓ విశిష్టమైన గౌరవం అభిమానం అందరికీ కలిగింది. దీనికి తోడుగా ఆ సైమను కమీషన్ రోజుల్లో చెన్నపట్నంలో వుండడం ప్రకాశంగారు చూపించిన ధైర్యసాహసా లన్నీ కళ్లార చూడడంతోటి అంతవరకూ మూలమూలల్లో వున్న కాంగ్రెస్ మీద భక్తి ఆరాధనా ఎక్కువై పోయింది. చరఖా పరిశ్రమ కూడా ఎక్కడ వీలైతే అక్కడ పెట్టించడానికి ప్రయత్నం చెయ్యడం ముందుగా తన ఇంట్లోనే అందర్నీ నిర్బగు చెయ్యడం జరిగింది.

ఇలా అప్పట్లో ఓ రాజకీయ చైతన్యం తీసుకువచ్చి ఓ నాయకుడు అయిపోయేడు వెంకట్రామయ్య. అందుగా వితంతు వివాహం, శారదాబిలు, వరకట్న నిషేధం, స్త్రీవిద్య స్వాతంత్ర్యం, వర్ణాంతర సౌభ్రాత్రం, హరిజనోద్ధరణ, అంగాంగీభూతలవోయి తీరుబడే లేకుండా మారిపోయింది ఆయన కాలం

ఇటువంటి వాతావరణంలో వయస్సు తీర్చిదిద్దుకున్న రమణమ్మకు, మొదటోనిప్పుడికి ఇంట్లోంచి అవధాని వచ్చేదే విగ్రహం విచ్ఛిన్నం అవుతుందో అని బెంగపెట్టుకుంది; మొదట్లో ఖంగారు పడింది. అశ్రో తదనంలో మూగమ తయిదువులావుండి అన్నిటికి సమాధానం అంటూ వచ్చేది ఆయన్ని చూచి.

ఆ తాలూకా ఆఫీసులో ఉద్యోగంలయి, చేరుకోపురంపేట సంసారం సాగించిన కొన్నాళ్ళకుకాని అవధాని అర్థం కాలేదు. ఆ సంపుటీకరణలో, ఆయనలో విస్తృత భావాలువున్నా వ్యక్తీకరించలేని పిరికితనం వుందన్న అభిప్రాయంలో పడింది. ఒక్కందుకు మాత్రం సంబర పడిపోయి ఆయన్ని ఆరాధించడంలోకి వెళ్ళిపోయింది. తను ఏంచేసినా కూడా కలుగచేసుకోకుండా, ఓ విధమైన గృహ స్వాతంత్ర్యం ఇచ్చేడన్నదే ఆ విషయం.

దీన్ని సద్వినియోగించడం తన విధి అని, తీరిక సమయాల్లో ఇరుగుపొరుగువాళ్ళను పోగుచేసి రాట్నం తిప్పడం, ఏకులు చేయించడం, ఆంధ్రపత్రికలో అనుదినం వచ్చే వార్తలు చదువుతూ చెప్పడం, వీరేశలింగం గారి ప్రహసనాలో, చిలకమర్తివారి గ్రంథాలో చదవడం చేస్తూవుండేది. ఇరుగు పొరుగు వారిలో శక్తికొద్దీ అభ్యుదయ భావాలు కలిగిస్తుండేది.

ఒక్క మాటలో చెప్పాలంటే ఆ వాడకి ఆవిడ ఓ చిన్న నాయకురాలైపోయింది

అప్పుడప్పుడు చెప్పిన మాటలనుబట్టి రేడి కూతురు ఎక్కడుందో, పెద్దోవల్లోపడి పాడయిపోయిందేమో, దాన్ని ఏ నాటికేనా తీసుకువచ్చి సరైనమార్గంలో పెట్టాలన్న ఆశ కలేది. దీనికోసం, అక్కడక్కడ వార్తల కోసం పొంచివుంచింది ఎరుగున్నవాళ్ళని.

ఆనాడు, నెల్క్రితం వెళ్ళిన అవధాని కూడా ఎవర్నో వెంటబెట్టుకురావడం చూచి మొదటిలో డీలాపోయినా వెంటనే మూడు ఏండ్లక్రితం చూచిన శచి ఎంతదయ్యిందో అనుకుని ఉత్సుకతోవచ్చి కౌగలించుకుని, పాతిళ్ళల్లోనే నడిపించింది.

శచిని, ఆ విషదంపాలిలమ్యనుండి ఈయన ఎలా తీసుకురాగలేదు? ఎందుకు? అన్నవి తెగని ఆలోచనలే అయినా, ఓ ప్రక్క ఈనాటి ఆయనలో, నివురు కప్పిన నిప్పులా వున్న చైతన్యానికి జోహార్లు పలికింది. కళ్లు చెమ్మగిల్లి పోయేయి.

పాదప్రక్షాళనం అయిన తర్వాత నే "రమణా! ఈ రోజునుంచే శచి మన దగ్గరే వుంటుంది. దాని బాధ్యతంతా నీదే" అన్నాడు నవ్వుతూ అవధాని.

"ఎన్నాళ్ళనుంచో ఇదే అనుకుంటూ వున్నాను. అది ఈ రోజుకు సిద్ధించింది. నువ్వుల్లో పెట్టి పెంచుతాను. ఏం శచీ నా దగ్గరవుండి చదువూ సంధ్యా నేర్చుకుంటావు కదూ?" అని అడిగింది. దగ్గరకు వచ్చి ఒదిగిన శచి పొంగివచ్చిన ఆనందంలో మాట్లాడలేక కళ్ళమ్మట నీళ్లు పెట్టుకుంది.

"ఎందుకూ ఏడుస్తావ్? ఆ కష్టాలన్నీ గట్టెక్కిపోయాయిలే!" అంటూ చీర చెంగుతో కళ్ళు తుడిచింది. చటుక్కున జ్ఞాపకం వచ్చి లోపలికివెళ్ళి కుంకపు భరిణె పట్టుకు వచ్చింది. తీసి వెంటనే బొట్టుపెట్టి "ఎంత లక్షణమైన మొఖం నా తల్లిది!" అని మురిసిపోయింది. అవధానికి కళ్లు చెమ్మగిల్లేయి!



సరస్వతీ సంగీత విద్యాలయ (హైదరాబాదు) వార్షికోత్సవంలో వీణ వాయిస్తున్న డి. స్వర్ణకుమారి, భారతీదేవి (ఆంధ్రవారపత్రిక బాలలసంఘం సభ్యురాండ్రు)

వదినగారు అక్కడ ఆపూటో కూడా కిచికి ఎంతో తోడునీడగానే వుండేవాళ్ళు. ఆ వదినలకూ ఇప్పుడు ఈ వదినకూ సహా ప్రాంశం లేదా కన్పించింది కిచికి. ఏ వంటరిగా ఉన్నపుడో మనసు నిలుపుకోలేక చూచాయగా దేవుడి అలమారలోని కుంకం తెచ్చుకుని పగిలిపోయిన అద్దంలో చూసుకుంటూ ఉన్న సన్నివేశం తక్కువ గుర్తుకు వచ్చింది కిచికి. దీనికి తోడు చక్కగా పువ్వులు తురుముకుని పాంజేబుపట్టీలు పెట్టుకుని గాజులు వాలుజడలు తొడుక్కుంటే ఎంత బావుంటుందో కదా- అని మనస్సు ఉరకలు వేసింది. దాంతో ఏవో ఏవో మధుర సంబాళింపులు అవురించేవి. కాని...

వెళ్ళిన ఎవలో ఒకటి ఇమ్ముకున్నట్లు "అమ్మా నాన్నా చూస్తే! అన్నగార్లకు తెలిస్తే!" అన్న భయం పెనుగాలిలా వీచేది. తేపవిలో మలమలలాడిపోయే గావాళులాగే ఒళ్ళొళ్ళులాడిపోతూ "ఒదినా! అవన్నీ ఒద్దు నాన్నా, అమ్మచూస్తే నిలువునా చీల్చేస్తారు!" అని చేతుల్లో తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడిచింది.

అవధాని రమణమ్మకూడా తెల్లబోయేరు!

"మా అమ్మే" అంటూ పొదివిదగ్గరకు తీసుకుని రమణమ్మ అనునయిస్తే అవధాని "రారమ్మా రారు! ఇక్కడినుంచి నువ్వు రంగు చీరలు, జాకెట్లు, గాజులు, పువ్వులు అన్నిటితో మా పలకుణంగా వుండాలి. నాన్న, అమ్మ ఎవరూ రారమ్మా! అవన్నీ ఒదినే నీకు చెపుతుంది" అని ఏవిధంగా అనునయం చెయ్యాలో తెలియక ముక్తసరిగా రెండు మాటలు మాట్లాడి వూరుకున్నాడు.

"ఓసారి ఆఫీసుకు వెళ్ళొస్తా" అని వెళ్ళిపోయేరు అవధాని.

"కాస్త ఫలహారం చేసి వెళ్ళవచ్చును" అంటూనే కొబ్బరి లవ్కౌరా జంతిక ముక్కలు పట్టుకొచ్చింది. అయినతర్వాత కాస్త మజిగ-నిమ్మకాయపిండినది-ఇచ్చింది.

ఆఫీసు మెట్లు ఎక్కేటప్పటికి అవధానికి తోటి ఉద్యోగుల్లో ఓ విచిత్రమైన చూపులు కనురెప్పలమధ్య భయం, కనుపించాయి. ఇదివరకు ఆదరంగా పిల్చి పిచ్చాపాటీ మాట్లాడే శిరస్తాదారు, పెద్ద గుమాస్తా కూడా చూసీ చూడనట్లు తలలు వంచేసుకుని పనుల్లో మునిగిపోయేరు. తోటి గుమాస్తాలుకూడా అలాగే ప్రవర్తించారు. ఇది ఖంగారు పెట్టింది అవధాన్ని. నమస్కారాలంటూ పెద్దలదగ్గర అని ముఖ్యుడు సూర్యానారాయణ దగ్గరకువెళ్ళి;

"ఏరా! ఏమిటిదంతా?" అన్నాడు సూర్యానారాయణ అవధానికూడా ఒకే వయస్సువాళ్ళు. ఇద్దరిస్నేళ్ళుకూడా ఒకేవీధిని ఓ వందగజాల దూరంలోవున్నాయి. రోజా పిచ్చాపాటి, ఊసుపోనప్పుడల్లా చెప్పుకోవడం అటు రాజకీయాలదగ్గర మొదలుపెడితే, ఇటు పక్కింటులో తహసీల్దారుగారు కోళ్ళు పోగుచేసుకోవడం వరకూ ఎన్నో దొర్లిపోయేవి. రాజకీయంగా ఆమూలాగ్రం గాంధీగారు స్వరాజ్యంకోసం ప్రారంభించిన ఉప్పుసత్యాగ్రహం, చరఖాఉద్యమం వగైరాలంటే, నిలువుదోపిడీ ఇచ్చేంత టి ఆరాధనవున్నా సూర్యానారాయణపైకి బ్రిటిష్ ప్రభుత్వంపట్ల అడుగులకు మడుగులొత్తే వినయ విధేయతలు, గౌరవం, భయభక్తులుకూడా ప్రదర్శించేవాడు.

'ఎందుకురా ఈ నక్కవినయం?' అని ఎవరేనా అంటే శిఖపట్ల గోత్రంవరకూ వాగ్వివాదాలు జరిపేవాడు.

# సమర్పణ

స్వతహాగా సహృదయుడే అయినా సూర్యనారాయణకు అండగా ఓవ్యక్తిగాని, ఆదుకోడానికి భూవసతి కాని లేదు. ఏదో కష్టపడి, వారాలు చేసుకుని సెకండరీవరకూ చదివి, కాళ్లూ కడుపు పట్టుకుని సంపాదించుకున్నాడు ఉద్యోగం. అదేపోతే చిప్పా కర్రా చేతికి వచ్చేటు వలసిన స్థితి ఏర్పడుతుంది. అందుకే మనిషి ద్విస్వభావాల్లో నలిగిపోయేవాడు; ఊగిస్లి పోయేవాడు. అవధాని మాసి సూర్యనారాయణ ఏమీ తెలియనట్టే తలూపేడు పెదిమలు విరుస్తూ.

హెడ్ గుమాస్తా బంట్రోతును పిల్చి తనకి వినపడాలన్నట్టు "అవధాని గారితో చెప్పు దొర కల్వమన్నాడని" అని పురమాయించేడు.

దీనంగా సూర్యనారాయణ చూస్తుంటే అవధాని నడిచి ఆ దొరగారి గదిలోకి వెళ్లేడు. లోపటికి రావడం చూచినా చూడనట్లు ఓపది నిముషాలు కాగితాలు త్రిప్పినవే త్రిప్పుతూ, కలం సిరాబుడ్డిలో ముంచి వ్రాయాలన్న ఉద్దేశ్యంతో ఉన్నట్లు కనబడి మరి ఏమీ వ్రాయకూడదు. అన్న తలంపులో మళ్ళీ పెట్టేస్తున్నట్లు నటించేడు.

ఇవన్నీ చూస్తూనే అవధాని నుంచుండి పోయేడు. నవ్వు వచ్చింది. ఈ దిష్టిబొమ్మ ప్రవర్తనానికి వచ్చేనన్నట్లుగా చిన్నెగ్గ దిగ్గాలనుకున్నాడు. కాని కార్యాచరణలో పెట్టలేక అలాగే నిలుచునిపోయేడు.

కొంచెంసేపాగి గంట కొట్టేడు. జవాను వచ్చిన తర్వాత "ఈ కాగితం తనకు ఇయ్యి" అనేసి మళ్ళీ తలవంచుకున్నాడు. కాగితాల మధ్యలో ముసుగు వేసుకున్నాడు.

కాగితం పుచ్చుకుని అవధాని చదివే టప్పటికి విపరీతమైన ఆవేశం వచ్చింది ఆ ఆఫీసరుగారి పెత్తనం, అమర్యాదా ఆ ఆవేశాన్ని మరింత రెచ్చగొట్టాయి

"ఉద్యోగంలోంచి తీసేసేరన్నమాట?"

"తెలియటం లేదూ? ఆ ఆర్డరు చదువుకున్నావా?"

"ఎందుకూ?"

"ఎందుకేమిటి! తెలియటం లేదూ? చిన్నవాళ్ళు, అభివృద్ధిలోకి రావలసిన వాళ్ళు, రాజకీయాల్లో ప్రవేశ మేమిటయ్యా! ప్రభు

త్వము తిండీ కూడా ఇస్తుంటే, దానికి ద్రోహం తలపెట్టి, స్వాతంత్ర్యం అంటూ పిచ్చికూతలు, వెర్రి వేషాలు వెయ్యడం ఏం బావుందయ్యా? అందుకే..." అని నవ్వేడు వెటకారంగా ఆఫీసరు.

"ఇల్లాంటి మాటలుపడి తినేకంటే అదే మేలు" అన్నాడు అవధాని.

"అయితే యీ యావారానికి బయల్దేరు రేపటినుండి."

"సరిగ్గా మాట్లాడండేం" అనేసి బయటకు వచ్చేసేడు. శరీరం కుతకుతలాడి పోతూంది. ఉన్న ఉద్యోగం పోయిందన్న చింత లేక పోయినా, ఇది ఇంత హఠాత్తుగా జరుగుతుందన్న విషయం అవధానికి మతిపోగొట్టినట్లయ్యింది.

ఆ రాత్రి రహస్యంగా సూర్యనారాయణ వచ్చి జరిగిన విషయాలన్నీ చెప్పేడు. రమణమ్మకు, ఆ తహసీల్దారు భార్యకు మాటా మాటా వచ్చే గులి పేసిందట. ఆవిడ సిగ్గుపడి, కోపంలో 'నీ మొగుడి ఉద్యోగం తీయించెయ్యకపోతే నా పేరు...' అంటూ అనిపన్నాగాలు పన్ని, మొగుడిచేత పై అధికారులకు అవధాని కాంగ్రెసు అభిమాని అనీ, అతనిభార్య కాంగ్రెసు మహిళా మండలి కార్యకర్త అనీ, ఊళ్ళో అందరిలో ప్రచారం చేసి కాంగ్రెస్ లో చేరమంటోందనీ, ప్రభుత్వ ఉద్యోగాల్లో ఇలాంటి విప్లవ భావాలున్నవాళ్ళను ఉంచటం ధర్మనిర్వహణకు ఆటంకమనీ వ్రాయించేసింది. దాని పర్యవసానమే ఇది అని అందిచ్చేసేడు.

రమణమ్మ అర్థం చదువుకుని ఒక్కసారి కుప్పకూలినట్టుగా అయి ఒక్క పోయి, మళ్లీ తేరుకుని "కాగల కార్యం గంధర్వులే తీర్చేరు" అంది.



సరస్వతీ సంగీత విద్యాలయ (హైదరాబాదు) వార్షికోత్సవ సందర్భంలో నృత్యం చేస్తున్న డి. భారతి దేవి, డి. స్వర్ణకుమారి.

అవధాని సూర్యనారాయణ మొఖముఖాలు చూసుకున్నారు.

"ఏముంది? అల్లా చూస్తారు. ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమయ్యింది కదా! దువ్వూరి సుబ్బమ్మగారి జట్టులో చేరుతాను నేను. వాళ్ళతో పాటు జైలుకి కూడాను" అంది.

మోపు కొట్టినట్లే అయ్యింది అవధానికి. క్షణంసేపు బులుసు సాంబమూర్తిగారు జ్ఞాపకం వచ్చేరు. దాంతో ఏవో ఏవో భావాలు క్రమ్ముకున్నాయి.

సూర్యనారాయణా! మరి మార్గం అంతే. ప్రభుత్వం తనంతట తాను స్వాతంత్ర్య సమరంలో దిగమన్నప్పుడు, మనం ప్రవేశించక పోవడం తప్పు కాదూ?" అంటూ అంతకాలు చెప్పేడు.

ఏది ఎల్లావున్నా ఆ మూడు నాళ్ళ రోజుల సామానుసర్దింపుల్లో మునిగిపోయినారు.

"ఆ వెధవముండ ఇంట్లో కాలెట్టింది. సుప్పున కూలిపోయింది సంసారం" అన్న ముసలి బోసెక్కల మాటలు వినపడ్డం తప్ప లేదు అవధానికి, రమణమ్మకు. ★

—ఇంకా వుంది]



బొంబాయిలో ఇటీవల జరిగిన అభినయ వార్షికోత్సవంలో పాల్గొన్న కుమారి దేవి, కుమారి అంబ.




# మాతృ హృదయం

★ మానాప్రగడ కామేశ్వరి ★

"నాయనా! ఒంటరిగా-నీతో చెప్పుకొని నా మనోవేదన చల్లార్చుకొనుటకు తగిన అవకాశం ఎన్నాళ్ళకెన్నాళ్ళకు లభించింది. ఒక్క ఘడియ ఓపికతో నా కన్నీళ్ళగాథ విని కర్తవ్యం నిరూపించు బాబూ! నీవు ప్రత్యూషమందు ఉపాసించే—ఆ కర్మసాక్షి ఎవరనుకున్నావు? నీవు రాధేయుడననుకుంటున్నావా? కాదు—కాదు- నేను చేసిన పని సిగ్గుచేటు అయినా—కన్నకడుపు తీపిచే చెపుతా విను.

"కన్నె వయసులో-మా పితృపాదుల ఆదేశానుసారం తపోధనులైన—అతిథి అభ్యాగతుల సేవచేసే భాగ్యం కలిగింది. ఒకనాడు దూర్వాస మహర్షి విచ్చేశారు. భక్తిశ్రద్ధలతో వారికి సపర్యలు చేశాను. ఆ మహాముని—నా సేవలతో—సంతుష్టుడయి—సర్వకర్మసాక్షియైన—ప్రభాకరుని ఉపాసించే-మంత్రోపదేశం చేశారు. తెలియక దీక్షగా—మననం చేసి-దానిని తెలుసుకొందామని—ఒకనాడజ్ఞానంచే—ఆ జ్ఞానస్వరూపుణ్ని ఆహ్వానించాను తలచిందే తడవుగా—ప్రభాత సమయంలో—నదీ తీరాన—ఏకతంగా నున్న—నా యెదుట—ఉదయభానుడు—సాక్షాత్కరించాడు

'బాలా! పిల్చి—బేలలా చూస్తావేం?' అన్నాడా మధురమూర్తి. వేయి కిరణాల వేదమూర్తికి—ఏం చెప్పాలో తోచక—తికమకపడ్డాను. సర్వసాక్షి—నా ఆంతర్యం గ్రహించి—అనుగ్రహించాడు. ఇంకేముంది? కన్యాత్వం కలుషిత మయ్యింది. బాలభానుని ప్రతిబింబంగా—నీ జనన మయ్యింది. రాచమర్యాదలకూ — సంఘనియమాలకీ—ఏం కీడు మూడుతుందో- అనే భయంతో—అయోమయ స్థితిలో ఉన్న—నన్ను— లాలించి— తేర్చి— కన్యాత్వం మొక్కవోకుండా—ఆ కారుణ్యమూర్తి—వరమిచ్చి—అనంత కాశంలో—దిన చర్యలో—తెలి మబ్బులను తీర్చిదిద్దుతూ—పురోగమించాడు. సందేహం లేదు బాబూ! నీవు నా తొలినోము పంటవు.

"అలా చూస్తావేం? అవివాహితనై—అక్రమమార్గాన్ని-అవలంబించాననా? అందు నా తప్పేం లేదు. ముని మంత్రం—పని చేస్తుందా—లేదా అని చూశాను. అంతే—దాని ఫలితమే నువ్వు. కావలిస్తే నీ నిత్యోపాసన మూర్తిని—మన సంభాషణకే—కాదు—సర్వ జీవరాశికీ సాక్షిగా నిల్చిన—ఆదిత్యుణ్ణి—అడుగు.

"నువ్వు తల్లి వేనా? అయితే కన్న కూనను గంగపాలు చేస్తావా? నీలో మాతృత్వం నశించిందా?" అని అడుగుతున్నావా?—అడుగు నాయనా! తప్పేం లేదు. వర్ణాశ్రమ ధర్మాలకు—వాదు వస్తుందేమోనని—అలా చేయవలసి వచ్చింది. తండ్రీ! కన్నకొడుకులు—రెండు వర్గాలై కయ్యానికి కాలు దువ్వుతుంటే—యే మాతృహృదయం తపించదు బాబూ! నామాట విను. పాండవ శ్రేష్ఠుడవై ప్రపంచాధినేతవు కాదగిన నీవు—రాధేయుడననిపించుకోవలసిన గతేం నాయనా!

"నీవు చెప్పింది నిజమేనా! — స్వామిద్రోహం చేయడం నామతం కాదంటావా?" బాగుంది. కర్మసాక్షి కుమారుడికి నర్మముందా? సరే! పోనీ! ఒకమాట యివ్వు బాబూ! యుద్ధంలో నీ తమ్ముళ్ళి చంపి, కన్నతల్లికి—కడుపుమంట—కల్పించనని మాట యివ్వవోయ్! ఏమంటావ్ "అర్జునుడి మీద నీకు కోపమా? మీ ఇద్దరు సమాన యోధులని మీ రాజా నమ్మాడా? వాడి విషయంలో దయ దల్చనంటావా?

"పోనీ—అలాగే—వాడిబాధ వాడే పడతాడులే. మిగిలిన వాళ్ళ జోలికి పోవుగదా! అంతే చాలులే. కన్నతల్లి మీద-కనికారంతో-ఈపాటి మాటైనా ఇచ్చావు. నీ ధర్మనిష్ఠకు-సేవానీతికీ—ఇవే నా దీవెనలు—

"ఉంటాను బాబూ! వెళ్లి రా-" ★



# సుఖాంతమైన సంక్రాంతి

## శ్రీనివాసకాశ్యప

"ప్రతిచిన్న విషయానికీ చిన్నపిల్లల్ని పట్టుకుని సాధిస్తుంటే అది మంచిది కాదన్నా నేగాని నీపిల్లల్ని నీసంసారాన్ని నిన్ను చక్కదిద్దుకోమన లేదే?...ఏదన్నా వాళ్ళు తెలీక తప్పుచేస్తే బుజ్జగించి అలా కాదు - ఇలా చెయ్యాలి - అని చెప్పకో వాలిగాలి గోడను బాదినట్లు బాదితే వాళ్ళకి ఇంగితజ్ఞానం కలుగుతుందా?-ఏమో! నేనూ పిల్లల్ని పెంచాను; పెద్దవాళ్ళను చేశాను. కాని ఆవిషయం తెలీలేదు ఇన్నాళ్ళుగా. ఇవ్వేళొచ్చి మీమీ మాటలు పడుతూ మీ అధికారాలకు అగగలాడుతూ పడుండాల్సిన రాత నాకేం పట్టలేదు. ఆమహారాజు కాస్తో కూస్తో గంజి కాచుకు తాగడానికి అట్టే పెట్టి పోయారు ఒకరిపెట్టు కోరిందకుండా. మీ పతాలు మీ నెత్తినపోసుకోండి! నా దారిన నాయింటికి నేను వెళ్ళిపోతాను."

అప్పుడే అలా స్నేహితుడు పార్వతీశంతో పనంజివెళ్ళి ఇంటికొచ్చాను. గడపలో అడుగు పెట్టానో లేదో వినిపించా యీ మాటలు. కాసేపలా నే నించుండిపోయాను. ఇంతలో ఓ సంచీలో గుడ్డలు కుక్కుకుంటూ గబగబా వాకిట్లోకొస్తున్న బామ్మ కన్పించింది. ఎదురుగా వస్తున్న ఆమెని ఆక్షణంలో చూడలేక పోయాను. కోపంతో ముఖం ఎర్రబారి వుంది. కనుకొలకులనుంచి జారుతున్నాయి అశ్రువులు! ఎందుకలా ఆమె బైటికివెళ్ళిపోతోందో అర్థంకాలేదు నాకు. అప్పుడున్న ఆమెమూర్తినిచూసి ఎలా పలకరించాలో గూడా తెలీక తెల మొహం వేసుకు చూస్తూ నించుండిపోయాను. కొంతసేపటికామె నాదృష్టికి దూరమైపోయినది. మెల్లిగా లోపలికి అడుగులు వేశాను. ఎదురుగా అత్తయ్యా, రాధా కనిపించారు. రాధను అత్తయ్య చంక నేసుకోబోతుంటే బిర్రబిగుస్తోంది రాధ. అది జారిపోతుంటే ఆమె పైకి లాక్కుంటోంది. రాధ సన్నగా ఏడుస్తోంది; 'బామ్మతో వెళ్తా నేఅత్తయ్యా!' అంటూ. 'నీళ్ళుపోసుకోపద. తిర్వాత వెళ్దువు గాని' అని నెమ్మదిగా దాన్ని దొడ్డివేపు తీసుకువెళ్తోందత్తయ్య.

"దాన్ని ఒదిలిపెట్టు కమలా! నేనొచ్చి పోస్తానునీళ్ళు?" గద్దించింది అమ్మ లోపల్నుంచి కోపంగా.

ఈమాటలు విన్న రాధ కూని రాగాలు తియ్యడం మానేసి అత్తయ్య చంకలో సరీగా కూచుని జాలిగాచూసిం దామెవేపు.

"నేనుపోస్తానే ఒదినా! మళ్ళీ నువ్వెందుకు?" అంది అత్తయ్య జాలిగా చూస్తున్న రాధవేపు చూస్తూ.

ఏమనుకుందో ఏమో మళ్ళీ మాట్లాడ్లేదు అమ్మ. రాధ, అత్తయ్యా దొడ్లోకి వెళ్ళిపోయారు.

"చిన్నప్పట్నుంచీ పెంచిందిగనుక దాన్నేమన్నా ఆమె సహించలేదు. ఆమెకు అదంటే గారాబమే ఆమె కామాత్రం అధికారంలేదూ ఈ ఇంట్లో? ... చిన్న విషయందగ్గర్నుంచి పెద్ద విషయందాకా ఇలాపోట్లాడుకుంటున్నాంటే ఇంట్లో మొగాడేం కావాలి?...మంచీచెడూ తెలీని కుర్రదానికి బుద్ధిలేదంటావుగాని, ఇవ్వేళొచ్చిన నీబుద్ధి ఏమయింది?...ఎందుకంతకష్టం కలిగించాలామెకి? పండగ ముందర ఆమె కాస్తా అలా ఆ పల్లెటూరికి వెళ్ళిపోతే అక్కడివాళ్ళేమనుకుంటారు? తీరాభోగినాటికి బావమరిది వచ్చి కూచుంటాడు అతనేమనుకుంటాడు. ఆమె ఇంట్లో లేకపోయేసరికి?... మనవరాలూ, పెంచిన ప్రేమాగనక ఆమె ముద్దుచేస్తుంది. అందులో తప్పేముంది? అసలీవిషయాల్లో ఎందుకు నీకింత పట్టుదల? ఏళ్ళొస్తాగా నేసరా?.. బుద్ధిలేకపోతే సరి!" అని గుసగుసలాడుతూ బయటికి వెళ్ళిపోయారు నాన్నగారు.

"ముద్దుచేసే నేనేం వద్దనలేదే?...ప్రతిదానికీ ఇప్పుడే అంత మంకుపట్టుపడుతుంటే ముందు ముందు అది అసలు చెప్పినమాట వింటుందా?...అన్నిటికీ అది ఆడిందే ఆట, పాడిందే పాటగా ఇలా చేసుకొస్తే ఎలాంటి పిల్లలైతేమాత్రం చెడిపోరూ... అంటుకని, "అన్నిటికీ గారాబంచేస్తే ఎలాగండీ! అలాఅయితే పిల్లలు చెప్పినమాట వింటారా?" అన్నాను. ఇందులో అంతకుమించరాని, తాము ఇల్లువిడిచిపోయేటంత తప్పేంచేశానుగనక?...దీనికేఇలాఅందరూ అలిగిపెట్టాలా?...ఇంతకి ఇదంతా నాకర్మ! ఎవర్నని ఏంలాభం? దాన్ని ఎవరి మాటా వినకుండా చేసేశారు. అది అన్నంతా సాగించుకుంటోంది ఈ ఇంట్లో. బామ్మగా తనకెంత బాధ్యతుందో తల్లిగా నాకూ అంతే బాధ్యతుంది. అలాంటప్పుడు, నేనీమాట అనడంలో తప్పేమిటి?...అతి గారాబం చెయ్యొద్దండీఅన్నాను అంతేగా! తమర్నేం దూషించలేదే...?" అంటూ గదిలో ఏడవడం మొదలెట్టింది అమ్మ.

ఇవతలింట్లోవున్న రాధ, "బామ్మకావాలే అత్తయ్యా!" అని మంద్రస్థాయిలో రాగాలాపన ప్రారంభించింది. ఆరోజు, ఉన్నట్టుండి ఇంటంతా విషాదం వ్యాపించినట్లనిపించింది నాకు. అంతా తలోమూలా దిగాలుగా కూచుండిపోయారు. ఇంతకీఅసలేంజరిగిందో అప్పటికి నాకు పూర్తిగా అర్థంకాలేదు. మామామయ్య పండక్కి వస్తాడని అప్పటికి వారంరోజులుగా మేమంతా హడావిడి పడిపోతున్నాం. ఆసంవత్సరమే మా కమలత్తకు పెళ్ళయింది. పెళ్ళయింతర్వాత మొదటి పండుగ-అందులో ముఖ్యంగా పెద్ద పండగ కనుక మామామయ్యను రమ్మని ఆహ్వానించారు పండక్కి. మా అత్తని ఇంకా కాపరానికి పంపించలేదు. అందుకని ఇక్కడేవుంది. పండగెళ్ళాక, ఏ మాఘమాసంలోనో పంపించాలని, బామ్మ వాళ్ళనుకుంటుంటే విన్నాను. పండక్కి కొత్త బట్టలూ అవీ దర్జాగా కొనాలని, అల్లుడికి (మామామయ్యకి) ఏదో బహుమతి ఘనంగా ఇవ్వాలనీ అనుకుంటోంది మా బామ్మ అందుకని అన్నిఏర్పాట్లూ చేస్తోందికూడా!

# ★ సుఖాంతమైన సంక్రాంతి ★

అసలు, పండగముందు మా స్వంత వూరెళ్ళి ప్రతిఏడూ, మా బామ్మ మానూలు చేయించి కొత్తబియ్యం, అవీ తెచ్చేది. కొంత ధాన్యం అక్కడ మా యింట్లో పోసేసి కొన్ని అమ్మేసి, బోలెడు డబ్బు కూడా పట్టుకొచ్చేది. ఈ సంవత్సరం మా మామయ్య రమ్మని ఉత్తరం రాయడంచేత, తీరా తను పండుగముందు అక్కడికి వెళ్లిపోతే, భోగిదాకా వుండాల్సొచ్చి తను రావడం ఆలస్యమయిపోతుందేమోనని వెళ్ళడం మానేసి. రైతుకు కబురుచేసింది; తనీసారి రావడానికి వీల్లేదని, పన్నుబియ్యం కొత్తవి పండగలోపల పంపించమనీను. కానీ, తీరా ఈమె ఇలా రాత్రియాత్ర దాల్చి ఎందుకు వెళ్ళిపోయిందో తెలీలేదు నాకు. ఆరోజు ఆదివారం కావడాన ఇంట్లోనే ఉన్నాను. మళ్ళీ నాన్నగారొస్తే ఎవర్నడగడానికీ వీలుండదని నిమ్మదిగా అత్తయ్యదగ్గర చేరిఅడిగాను సంగతేమిటని.

"పొద్దున్నే, మీరంతా కాఫీలు తాగాక అమ్మ స్నానంచేసి వంట ప్రయత్నంలో వుండిపోయింది. ఏదో స్వీటూ అదీ చెయ్యాలని. రాధకి నీళ్లు పోద్దామని ఒదిన పిల్చింది. అది బామ్మే పొయ్యాలని పట్టుపట్టింది. ఒదిన నాలుగు చరిచింది రాధని. అమ్మ నన్ను కేకేసి రాధకు నీళ్ళు పొయ్యమంది. దాన్ని ఏడిపిస్తున్నారని విసుక్కుందామె లోపల్నుంచే. నేను గదిలోంచి ఇవతలికొచ్చి రాధను ఎత్తుకున్నాను. వదిన అందుకుని, 'దాన్ని మీరందరూ గారాబంచేసి. సగం చెప్పినమాట విననుండా చేసున్నారు! వదిలిపెట్టు కమలా దాన్ని! నే నేపోస్తా నీళ్ళు. ఎందుకు పోయించుకోదో, తల ఎలా దువ్వించుకోదో చూస్తాను' అంది కొంచెం కోపంగా ఒదిన. అయితే మరీ అంతకోపం పైకి చూపించలేదనుకో! ఐనా అమ్మకి మాత్రం విపరీతమైన కోపం వచ్చేసింది. చేసే చేసే పని ఎక్కడిదక్కడ వదిలేసి విసుక్కుంటూ సంచిలో నాలుగు గుడ్డలు పెట్టుకుని ప్రయాణమైంది. ఇంతలో అన్నయ్య లోపలికొచ్చాడు, ఎక్కడికో వెళ్ళినవాడు. అన్నయ్యతోకూడా ఏమీ మాట్లాడలేదు. గబగబా బైటికి వెళ్ళిపోయింది అమ్మ. నేనేదో చెప్పబోతుంటే కూడా వినిపించుకోలేదు. వదిన గదిలోకెళ్లి ఏడవడం మొదలెట్టింది. ఎవరికేం చెప్పగలం!..." అని ముగించింది అత్తయ్య. అదా సంగతి అనుకున్నాను నేను.

* * *

నిజానికి రాధంటే అమిత ప్రేమ బామ్మకి. అది ఏదికావాలంటే అది తెచ్చియిచ్చేది. కొండమీది కోతి కావాలన్నా బామ్మ సమకూర్చడానికి సిద్ధమే! అంత యిదిగా చిన్నప్పటినించీ దాన్ని పెంచుతోంది. ఆమె ఆసరా చూసుకునే అది ప్రతిదానికీ పేచీకి దిగుతుండేది. దాని సంరక్షణంతా ఆమెచేతి మీదుగానే జరగాలి. తలదువ్వడం, నీళ్ళు పొయ్యడం, అన్నం పెట్టడం దగ్గర్నుంచి నిద్రపుచ్చేదాకా ఆమే చెయ్యాలి, లేదా మా అత్తయ్య అయినా చెయ్యాలి. అంతేగాని, అమ్మదగిరది అరనిమిషం కూడా వుండేదిగాదు. ఆమెదగ్గిరైతే అది చెప్పినట్లల్లా ఆమె తలాడించేదిగాదు. చెప్పినమాట వినకపోతే నాలుగు తన్నేది. అందుకని, ఆమెను చూస్తే బెదిరిపోయి అసలు దగ్గరచేరేదేగాదు. బామ్మా, అత్తయ్యా అమిత గారాబంచేసి రాధను తనకు దూరంచేస్తున్నారన్న అనుమానంతో వాళ్ళలా చెయ్యడం అమ్మకి గిట్టేదికాదు. దానాదీనా ఈ చిన్నతగాదా జరిగింది. ఇదీ అసలుకథ!

బామ్మ వూరికెళ్ళినప్పట్నించీ రాధ సరీగా తిండితినడమే మానేసింది. ఎప్పుడూ ఏదో ఒకపేచీ పెట్టుకుని ఏడుస్తూండేది. దానికి బామ్మమీద బెంగవల్ల అత్తయ్య దగిరచేరి గొణుగుతూ వుండేది బామ్మదగిరికెళ్తానని. ఆమె వూరికెళ్ళిన ఈ వారం పదిరోజులకే చాలా చిక్కిపోయింది రాధ. దాన్ని చూసినప్పుడల్లా జాలేసేది. బామ్మ వూరికెళ్ళిపోయినప్పట్నించీ యింట్లో



# ★ సుఖాంతమైన సంక్రాంతి ★

శాంతి ఆవరించింది. ప్రతిపూటా అమ్మ మీద కేకలేస్తూనే వుండేవారు నాన్నగారు.

* * *

నిమ్మదిగా ఇరవై రోజులు గడిచాయి. రాధ చిక్కి సగమైంది. కళ్లలోతుకు పీక్కుపోయాయి. అన్నం కలిపి నోట్లో పెడితే పళ్లు బిగించి మింగేదికాదు. ఎప్పుడో మరీ ఆకలైతేతప్ప ఇన్ని పాలన్నా తాగేదికాదు. ఇలా సాగుతోంది రాధ సత్యాగ్రహం!

దీనివరస చూసేసరికి దిగులుపుట్టుకొచ్చి, నాన్నగారు నానా కేకలూ వేసేవారు అమ్మని. బామ్మని వెళ్ళిపిల్చుకు రమ్మంటే, నే వెళ్ళనన్నారు. పైగా, అమ్మేవెళ్లి బామ్మ కాళ్లమీదపడి బతిమాలి తీసుకురావల్సిందే గాని, తనేమీ తను వెళ్ళనన్నారు. చేసేదేం లేక గుటకలుమింగుతూ వూరుకుందిఅమ్మ.

ఒకరోజు మధ్యాహ్నం మాకు మామూలుగా గుడ్డలుయిచ్చే అతను వచ్చాడు. ప్రతి పండక్కీ తప్పకుండా వచ్చి యిచ్చి పోతుండేవాడు. ఆ మామూలు ప్రకారం అతను వచ్చాడు. డబ్బు చేతిలో వున్నప్పుడు తెచ్చిస్తూండేవాళ్లు. అలాగే సంక్రాంతి దగ్గరపడ్తోందిగదా అని బట్టలమూట నెత్తి కెత్తుకుని వచ్చాడు. వాకిట్లో మూటదింపుకుని బామ్మని కేకేశాడు మరి బామ్మ లేదుగా! అందుకని అమ్మే బైటికొచ్చింది.

"పండక్కి బట్టలు తీసుకోరా అమ్మగారూ?" అన్నాడు.

"ఇప్పుడేం వద్దు లేవయ్యా!" అంది అమ్మ అదోలా.

"అదేమిటమ్మగారూ! పెదమ్మగార్ని పిలవండి. ఆ అమ్మతో మాట్లాడి వెళ్తాను" అన్నాడతను.

"పెద్దమ్మగారు వూరికెళ్ళారు!" అంది అమ్మ దిగులుగా.

"అమ్మగారు, ముందు బోణీచేస్తే తెచ్చిన సరుకంతా అయిపోతుందండీ ఇప్పు" అన్నాడు నిరుత్సాహంగా వర్తకుడు.

"సరే! మరి ఆమె లేదనే ఇప్పుడు తీసుకోడం మానేస్తా" అంది అమ్మ గాద్గదికంగా.

"పోనీలెండి అమ్మా," అంటూ దిగులుగా కదిలాడతను. నాలుగడుగులు వేసినవాడల్లా మళ్ళీ వెనక్కువచ్చి "పోనీ అమ్మగారూ! భోగిరోపనగా వస్తాను. అమ్మగారితో చెప్పండి. అయినా ఆమె వుండరేండి. భోగి నాటికైనా వచ్చేస్తారు. మళ్ళీ ఓసారివచ్చి చూసిపోతాను!" అనిచెప్పి వెళ్లిపోయాడు

అతనలా వెళ్ళాక, అమ్మ కెందుకో ఆపుకోలేని దుఃఖం వచ్చేసింది. ఏం చెయ్యటానికీ తోచక కాబోలు గదిలోకెళ్లి పడుకుంది రాధకూడా తనకి కొత్తబట్టలుకొనేదని కాసేపు గోలచేసింది అత్తయ్య ఎగిర. బామ్మయితే నాక్కూడా మంచి మంచి బట్టలు కొనిచ్చేది. ఈ పెద్దపండుగ చాలా ఘనంగా చేసేది. ఎన్నో పిండివంటలుచేసి, ఏది లేదనుకోకుండా నలుగురికీ పెట్టేది. సంక్రాంతి పండగ బలేదర్జాగా చేసేది. అసలీ సంవత్సరం మా మామయ్యకూడా వస్తాడు గనుక యింకా బాగా చేసుంది బామ్మ అనుకున్నాను. కాని, అన్నీ తల్లక్రిందులయాయి.

ఆమెవుంటే, అన్నీ తన చేతిమీదుగా చేసుకుపోయేది. అలాంటిదిఆమె ఇంట్లో లేకపోయేసరికి ఎవరికీ ఉత్సాహం లేదు. అంతా అదోలా అయిపోయారు. చిన్నపిల్లల్ని కేకలేసే ఈ పెద్దవాళ్ళు, ఇలా ఎందుకు తగూలాడుకుంటారో అర్థంకాలేదు నాకు. చిన్న చిన్న విషయాలకి పెద్ద పెద్ద అర్థాలుకల్పించుకుని ఒకళ్ళనొకళ్ళు జీవితాంతం ఎందుకు సాధించుకోవాలనుకుంటారో కూడా, ఎంత ఆలోచించినా బోధపడలేదు ఒకరికి చెప్పడమేగాని, తాము ఆచరించడంవుండదు ఈ పెద్దవాళ్ళలో. నిజానికందరు పెద్దవాళ్ళలా కాదు బామ్మ. కాని, ఆమె కూడా ఈసారి ఇలా ఎందుకుచేసిందో!... అనుకున్నాను. నా ప్రశ్నకి సమాధానం దొరకలేదు.

"ఏమయితే నేం! పండక్కి మామయ్య రావడంగాని, కొత్తబట్టలు కొనుక్కోడం గాని, సర్దాగాఅందరం కాలక్షేపం చెయ్యడం గాని లేకుండా పోయాయి. ప్చ్!" అనుకున్నాను. అయినా ఒక్క ఆశమాత్రం వదలేదు నన్ను. "భోగినాటికైనా బామ్మ వచ్చితీరుతుంది. కారణం—ఇన్నిరోజులు మమ్మల్ని వదిలివుండలేదు ఎప్పుడూ. కాగా, మామయ్య పండక్కివస్తాడని ఆమెకి తెల్సు. అందుచేత తప్పకుండా వచ్చేస్తుంది," అని గట్టినమ్మకం కుదిరిపోయింది.

బామ్మ ఎప్పుడువస్తుందా అని ఎదురు చూస్తున్నాను నామటుకు నేను. ప్రతి రోజూ పొద్దున్నే బస్సు కొస్తుందేమోనని వాకిట్లో కాపలా వేసేవాణ్ణి ఒకరోజున— ఇక రెండురోజులుమాత్రమే వుంది భోగి— వాకిట్లో నించున్నాను. రెండెడ్లబండి మా ఇంటివేపే రావడంచూసి, నా హృదయం గంతులేసింది! నా ఆనందానికి అంతేలేదిక. బండి వాకిట్లోకి వచ్చేదాకా ఆత్రుతపడి పోయాను. తీరాచూస్తే మా రైతు! ఒక బియ్యంమూటా, ఇంకా ఏవేవో వేసుకుని వచ్చాడు. అవి లోపలపడేసి, ఎడ్ని బండికి కట్టేసి అతను అలా బజార్లోకి బయల్దేరాడు. అతనితోపాటే నాన్నగారు కూడా వెళ్లారు. ఇద్దరూకల్సివెళ్ళి పండక్కి ఏమన్నా కొనుక్కొస్తారేమో అనుకున్నాను. అతను మాత్రం వూరికి పట్టుకెళ్లడానికి ఏవో గుడలుకొమోను కొనుక్కున్నాడు. నాన్నగారు మాత్రం చేతులూగించుకుంటూ వచ్చారింటికి.

ఇంటికి రాగానే మా రైతుకు భోజనం పెట్టారు. అతను భోజనం చేసేసి బయల్దేర బోతున్నాడు. ఇంతలో టెలిగ్రామ్ వచ్చింది అంతా ముందు కంగారుపడి పోయారు ఏమిటోనని. తీరా, చించిచూసే— మా మామయ్య, భోగినాటికి వస్తున్నాననీ, స్టేషనుకు రావాల్సిందనీ ఇచ్చిన టెలిగ్రాము.

రైతు బండికట్టుకుని బయల్దేరాడు నాన్నగారు కూడా ఆఫీసుకు వెళ్తూ రైతును సాగనంపటానికి అతన్తోపాటే బయల్దేరారు.

* * *

ఒంటరిగా వాకిట్లో నిలుచున్నాను. ఇంక ఒక్కరోజేవుంది భోగిపండగ. బామ్మ వచ్చే సూచనేమీ కనిపించలేదు. నా గాలిమేడలన్నీ గాలిలో కలిసిపోయాయి ఒక్కసారిగా. ఆనాడు యింట్లో అందరికన్నా విచారం ఎక్కువైంది నాకు. అయినా ఆశగా వాకిట్లోనే తచ్చాడుతున్నాను. కారణం—ఏ బస్సులో వచ్చినా వచ్చెయ్యచ్చు బామ్మ. రోజుకి నాలుగు బస్సులున్నాయి మా వూరికి. చాలామంది బస్తీనించి సరుకులు కొనుక్కుని మావూరికి నడిచే వెళ్తుంటారు కూడా. అందుకని ఇంకా బామ్మ వస్తుందన్న ఆశ పట్టుకు పీడిస్తూనే వుంది నన్ను. అందుచేత వాకిట్లోంచి కదల బుద్ధెయ్యలేదు. అదిగాక, నిన్న రైతువెళ్లి టెలిగ్రామ్ వచ్చిందని కూడా చెప్పి వుంటాడు. ఇలాఇలా ఆలోచనలు నా బుర్రలో పరుగెడుతూనే వున్నాయి. ఇంతలో వాకిట్లోకొచ్చి ఆగింది బండి!

గబగబా బండి ముందుకు వెళ్ళాను నేను.

(64-వ పేజి చూడండి)



మూలం
మానిక్ బంద్యోపాధ్యాయ
అనువాదం
మద్దిపట్ల సూరి

(గతసంచిక తరువాయి)

జయ మనోభావానికి మతి మనసులో చాలా భయపడింది. హఠాత్తుగా జయ ఇలా అయిందేమిటి? కుముద్ ని వలలో వేసుకోలేకపోయినవాళ్ళలో జయకూడా ఉందా? అలా అయితే జయకి చాలా కష్టంగా ఉండి ఉంటుంది. అలాంటప్పుడు కుముద్ తనని తీసుకొచ్చి ఇక్కడ ఒక ఇంట్లో ఎందుకు కాపురం పెట్టినట్లు! జయమీద ఆమెకి క్రమంగా జాలికలగసాగింది. ఆమెమీద అసూయ కంటె సానుభూతే ఎక్కువ కలుగుతోంది. జయలో ఈ వచ్చిన మార్పు కేవలం తాత్కాలికమైనది కాదని కొద్దిరోజుల్లోనే గ్రహించింది మతి. పనులో ఉత్సాహం కనిపించటంలేదు. ప్రతిభావంతుడైన భర్తకి విశ్రాంతి మొదలైన సౌకర్యాలు కల్పించటంలో ఇదివరకులా ఆరాటపడటంలేదు. ముఖం చిట్లించుకుని ఏదో క్లిష్టసమస్యని అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నట్టుంటోంది. తాను, కుముద్ పైకి మాట్లాడుకునే విషయాల్ని, ఒకరి ఉద్దేశ్యాలు ఒకరు గ్రహించటాన్ని జయ శ్రద్ధగా గమనిస్తున్నట్లు మతి గ్రహించింది. జయ మనస్సులో ఏమున్నదో? తనమీద ఇలా ఒక కన్ను వేసి ఉంచటం దేనికి? భయంతో మతికి గుండెలు టకటక కొట్టుకుంటున్నాయి.

తీరిక వేళల్లో—ఒకప్పుడు తొందరపని ఉన్నా వదిలేసికూడా వనవిహారి ఓ పెద్ద కాన్వాసుమీద కుంచె ఆడిస్తుంటాడు. ఈ కాన్వాసును జయ గృహదేవతలా చూసుకుంటూ ఉంటుంది. దాని విషయంలో ఆమె చూపే శ్రద్ధ ఇంతా అంతా కాదు. ఇది విక్రయించటానికి కాదు. ఎవరూ పురమాయించి వేయించుకుంటున్నదీ కాదు. కేవలం తన ప్రతిభ ప్రేరేపణవల్ల వీలుబాటు చిక్కినప్పుడల్లా రంగులు వేస్తుంటాడు. ఎప్పుడో ఒకప్పుడు దేశదేశాల్లో జరిగే చిత్రప్రదర్శనశాలల కన్నిటికీ తిరుగుతూ ఈ చిత్రం అతనికి కీర్తి తెచ్చిపెడుతుంది. ఇదంతా మతికి అర్థమయేది కాదు. అతను మామూలుగా వేసే చిత్రాల్లో ఇది ఒకటని—ఇది పూర్తిఅయితే దీనిమీద ఎక్కువ డబ్బు రావచ్చని మాత్రమే అనుకునేది మతి. కొన్నాళ్ళుగా జయ వనవిహారీ ఈ చిత్రం విషయమై మాట్లాడుకోవటం వింటూ ఉంటోంది. జయ కేవలం ఈ మాట్లాడుకోవటంలో అంతకే ఉన్నట్లు కనిపించటంలేదు. ఇంచుమించు పూర్తిఅయిన ఆ చిత్రాన్ని అప్పుడప్పుడు తాను తెర తప్పించి తీక్షణంగా చూస్తూ ఉండటం మతి గమనించింది. 'జయ లాగా కొంచెం స్థూలకాయిని అయిన ఒక స్త్రీ చిక్కిశల్యమైపోయిన శిశువును క్రింద పడేసి, పరుగెడుతున్న ఓ చక్కని దేవశిశువులాంటి కుర్రవాడికేసి చేతులుచాచి ఎంతో ఆశగా చూస్తోంది—' ఇదీ ఆ చిత్రం. ఆ చిత్రంలో ఏం గొప్పతనం ఉందో మతి కేమీ తెలిసేదికాదు. బహుశా అది తనకళ్ళలోని దోషమై ఉండవచ్చునని అనుకుంది. ఇంత అద్భుతమైన చిత్రాలు ప్రపంచంలో అయిదారుకంటె ఎక్కువ ఉండవు అని జయ చెప్పే మాటల్ని ఆమె నమ్ముతుందా ఉంటుందా? కొన్నిరోజులుపోయాక ఓనాడు ప్రొద్దున జయ ఈ చిత్రాన్ని చించేసింది...

ఆనాటి జయ వాలకాన్ని, ఆమె అలాంటిపని చేయటాన్ని మతి ఎన్నటికీ మాని మరగదు. కుముద్ ఇంట్లోలేదు. [illegible] ఉంటుందప్పుడు. మతి వంట పూర్తి అవుతూ అవుతూ ఉంది. జయ వాలకం ప్రొద్దుటించీ భయంకరంగా ఉంది. రాత్రి బహుశా భర్తతో కలహించి ఉంటుంది జయ. ఒకటి రెండు మాటలు అడిగినా జయదగ్గర్నుంచి సమాధానం ఏమీ రాకపోవటంతో ఇంక

## జరిగిన కథ

శశి పల్లెటూరి డాక్టరు. అతని తండ్రి గోపాల్ [illegible] వృత్తిగాపెట్టుకుని డబ్బు గడించాడు. ఉన్నతాశయాలు ఉత్తమ సంస్కారం కలిగిన శశికి తండ్రితో పడదు. అతనికి ఆ పల్లెటూర్లో సన్నిహితులయిన వారు చాలా కొద్దిమంది. పిడుగుపడి మరణించిన హారూఘోష్ కుటుంబంలో హారూకొడుకు పరాన్, అతనిభార్య కుసుమ, పెళ్లికానిఅమ్మాయి మతి, నాటు వైద్యుడు యామినీ కవిరాజూ అతని భార్య సేనదిదీ—వీరే. అతడు కలకత్తాలో చదువుకుంటూండగా సహోధ్యాయిగాఉన్న కుముద్ ఇప్పుడు భాగవతులజట్టులో చేరి ఊరూరా తిరుగుతూ శశివాళ్ల గావాదియా గ్రామంవచ్చి నాటకాలువేసి, మతిని మంచి మాటలతో వలలో వేసుకున్నాడు. సేనదిదీ మశూచికం వచ్చి శశి వైద్యంతో బాగుపడ్డా కన్ను పోగొట్టుకుంది. శశి చెల్లెలు బిందును తండ్రిగోపాల్ కలకత్తాలో పెద్దవ్యాపారస్థుడయిన నందలాల్ కిచ్చి బలవంతపు పెళ్ళిచేశాడు. ఒకసారి శశి ఏదో పనిమీద కలకత్తా వెళ్ళాడు. అక్కడ శశి తన చెల్లెలు బిందూ భర్తచేతపడుతున్న అగచాట్లు చూడలేక ఆమెను నందలాల్ కు తెలియకుండా స్వగ్రామం తీసుకు వచ్చేశాడు. ఆతరవాత ఒకనాడు శశి మిత్రుడుకుముద్ గావాదియా వచ్చాడు. శశి ఇష్టపడకపోయినా అతన్ని ఒప్పించి మతిని పెళ్ళిచేసుకున్నాడు. తరవాత భార్యతో 'హనిమూన్'కి వెళ్ళిపోయాడు. ఆ తరవాత ఇక అతనిపత్తా ఎవరికీ తెలియలేదు. చెల్లెలు బిందునుమళ్ళీ భర్తవద్ద వదిలిరావటానికి కలకత్తా వెళ్లిన శశి ఎంతవాకబు చేసినా అతనిజాడ కనుక్కోలేకపోయాడు. కుముద్ కలకత్తాలోనే ఒక యింట్లో భార్యతో సహా కాపరంపెట్టాడు. స్వేచ్ఛాచారి అయిన అతని జీవిత విధానం పల్లెటూరిపిల్ల మతికి అంత సరిపడలేదు. ఇకచదవండి:

అడగటానికి మతికి ధైర్యం చాల్లేదు. కొంచెంసేపటికి తనే జయ వంటచేసేసి బయటికి వెళ్ళింది. హఠాత్తుగా వనవిహారి—జయ మాటా మాటా అనుకోవటం మతి చెవినిపడింది. దబుక్కున బయటికి వచ్చి చూసింది. కుంచె చేతపట్టుకుని, గ్రుడ్లెర్రచేసుకుని వనవిహారి ఆ చిరిగిపోయిన చిత్రం ముందునుంచుని ఉన్నాడు. కాస్త దూరంగా నుంచుని ఉంది జయ, ఆమె ముఖమూ ఎఱ్ఱబడిఉంది. కంపించి పోతూఉంది ఆమె.

"చించిపారెయ్యి—చించిపారెయ్యి దాన్ని. ఇన్స్పిరేషన్! చిత్రాలు వెయ్యటంచేతకానివాడికి ఇన్స్పిరేషనా! ఆమాట అనటానికి సిగ్గయినా లేదూ?"

జయగొంతు పట్టుకుపోయింది ఈ మాటలంటూంటే. వనవిహారి కోపాన్ని అణచుకుంటూ "ఇన్నాళ్ళయాక ఇప్పుడంటున్నావేమిటి ఈమాట జయా?" అన్నాడు.

"ఇన్నాళ్ళూ గ్రుడ్డిదాన్నయిపోయాను — నువ్వేదో పెద్ద ప్రపంచాన్నంతనీ జయించగలవనుకున్నాను. పెద్ద పెద్ద మాటలుచెప్పి భ్రమపెట్టావ్ నన్ను — మోసగాడివి, వంచకుడివి."

వనవిహారి పిరికివాడే. కాని ఈ మాటలన్నీ సహించి ఊరుకునేటంత పిరికిమాత్రం కాదు. "నీవలాంటివాణ్ణి అయితే కావచ్చు. ఇన్నాళ్ళూ గ్రుడ్డిదానివిగాఉంటే మరి ఇవాళ ఈ దివ్యదృష్టి ఎక్కడినుంచి వచ్చింది? నీకు కనువిప్పు కలిగించిందెవరో కాస్త చెపుదూ!...కుముదుడా యేం?" అన్నాడు.

తర్వాత ఇహ జయచేతిలోని చురకత్తితో కాన్వాసంతా చీలికలైపోయింది. కొన్నెప్పు ప్రతిమలా అలాగే చూస్తూనుంచుని— వనవిహారి లోపలికివెళ్ళి చొక్కాచేతో పుచ్చుకుని బయటికి వెళ్ళిపోయాడు. జయ లోపలికివెళ్ళి తలుపులు వేసేసుకుంది. ఆ చురకత్తి పట్టుకున్నప్పుడు జయవేలు కొంచెం తెగినట్టుంది. అడుగుమీద కాసిని నెత్తురుబొట్లు పడిఉన్నాయి.

ఏమిటి అఘాయిత్యం అంతా? జయకి మతిచెడిందా ఏం? మిగిలినవంట ఇహ చెయ్యలేకపోయిందా భోజన మతి. కొంచెంసేపయాక జయ గదిదగ్గిరకివచ్చి తలుపు మెల్లిగాతట్టి పిలిచింది. పిలవగా పిలవగా కొంతసేపటికి జయ లోపల్నుంచి "వెళ్ళు మతీ వెళ్ళు విసిగించకు నన్ను" అన్నది.

కుముద్ వచ్చేంతవరకు మతి మెదలకుండా తనగదిలోకిపోయి కూర్చుంది. ఆమెకేదో పెద్ద బెడద వచ్చి పడట్టుంది. ఇలాంటి తెనుపు మీరిన పనులన్నీ ఆమెకి అరంకావు. భార్యాభర్తలు కీచులాడుకోవటం సహజమే. కాని ఇదెక్కడి పద్ధతి!

జయ ఒకటంటే—వనవిహారి ఒకటంటాడు. ఆ మాటల అర్థం ఏమిటి? ఈ తగాదాలో తనకికూడా ఏమూలో పాలు ఉన్నట్లు తోచింది మతికి. ఇది కేవలం జయ—వనవిహారిల మధ్య యేర్పడ్డ తగాదా కాదు. ఏం చేసింది తాను? తన తప్పు ఏమిటి? ఎవరైనా చెపితే బావుండును మతికి. కుముద్ చాలాసేపటికి వచ్చాడు. అతణ్ణి లోపల కూర్చోపెట్టి జరిగినదంతా చెమ్మదిగా చెప్పింది మతి.

"అయితే కొంప మునిగింది మతీ!" అన్నాడు కుముద్.

మతి కంగారు పడుతూ "ఎవరికొంప? ఏమయింది? నాకు తెలిసేట్టు చెప్పండి. తల తిరిగి పోతోంది నాకు" అన్నది.

"తర్వాత చెపుతానులే తెలిసేట్లు. అసలు నాకే సరిగ్గా అంతుపట్టకుండా ఉన్న దిప్పుడు. ఎంత ఉక్కగా ఉందో చూడు. కాస్త విసురుదూ!"

మతి ఇవాళ చాలా కంగారు పడిపోతోంది. లేకపోతే విసరమని చెప్పక్కర్లేదామెకి. చెమట ఆరాక కుముద్ స్నానానికి వెళ్ళాడు. భోజనం అదీ అయాక పడుకుని నిద్రపోయే ప్రయత్నంలో ఉన్నాడతడు. "అక్కని ఒకసారి పిలవరాదూ?" అన్నది మతి.

"ఇప్పుడా? కోపంవచ్చి తలుపులు బిడాయించుకు కూచుంది. ఎవరు కదిలించగలరామె నిప్పుడు? వస్తే నా మీద తిరగబడుతుంది. నువ్వెళ్ళి అన్నం తినిరా"

స్నానంచేసి వచ్చి అప్పుడే అన్నంముందు కూర్చుంది మతి. జయ తలుపులు తీసుకుని బయటికి వచ్చింది. వంట ఇంట్లోకివచ్చి ఓ గ్లాసెడు నీరు తీసుకుని గడగడ త్రాగేసింది

"మీకు జగడమెందుకు వచ్చింది అక్కా?" అని మతి భయపడుతూ భయపడుతూ అడిగింది.

"చిన్నదానివి చిన్నదానివి లాగానే ఉండరాదూ మతీ!" అన్నది జయ.

తర్వాత జయ మతి గదిలోకి వెళ్ళింది. మతి ఇంక అన్నం తినలేదు. తినటానికి భయంగాఉంది, కంఠం ముంగు

# టిక్కెట్టు లేకుండా చేసే ప్రయాణాన్ని అరికట్టాలి...

## టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయడం గౌరవకరమైన విషయం కాదు.



ప్రయాణీకులకు సుఖప్రయాణం చేకూర్చడం కోసం టిక్కెట్లు లేకుండా చేస్తున్న ప్రయాణాలను పూర్తిగా అరికట్టాలి.

అట్లా చేయడానికి, దయచేసి మాకు సాయపడండి! టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న వ్యక్తి మీ కంటబడిన ప్రతిసారి, టిక్కెట్లను పరీక్షచేసే ఉద్యోగికి అతనిని చూపించండి! ఈ అసౌకర్య కారణాన్ని, దేశానికి వాటిల్లుతున్న నష్టాన్ని నివారించడం నిమిత్తం, అందరి హృదయపూర్వక సహకారం అవసరం.

— దక్షిణ రైల్వేచే ప్రకటించబడినది



# మాలతి పెళ్లి

"ఏమేవ్!... నీకేదో పెళ్ళి శుభలేఖ వచ్చిం" దంటూ మా వారు వీధిలోంచే కేక వెయ్యగానే, ఉతుకుతూన్న బట్టలు అక్కడ పడేసి చేతులు కడుక్కొని చీర చెంగుతో తుడుచుకుంటూ ఒక్క అంగలో వీధిలోకి వచ్చాను.

"ఏమండీ!... ఏదీ? ... నా పేరే వచ్చిందా?" — అంటూ ఆత్రంగా అడిగాను; నా పేర ఇంతవరకూ యిలాంటి శుభలేఖలు రావటం యిదే మొదలవటంచేత"

"ఆ!...నీ పేరే వచ్చింది!... ఇన్నాళ్ళకి నేను కేరాఫ్ గాడికింద జమ అయ్యాను...' అంటూ నవ్వుతూ మా వారు నాకు ఆ శుభలేఖ అందించారు.

గబగబ ఆ కవరు చించి తీసి చదువుకున్నాను.

"ఆ!...మాలతికి పెళ్ళా?..." అన్నాను అప్రయత్నంగా!

"ఏమిటే?...ఎవరిది పెళ్ళి? ... ఎవరా మాలతి? అంటూ మా వారు ప్రశ్నించారు.

"మీకు తెలవదులెండి మాలతిని..." అని ఏమేమో చెప్పబోయేసరికి యింతలో బాబిగాడు కాళ్ళకడ్డంబడి ఏడుపు ప్రారంభించాడు. వెంటనే వాడిని ఎత్తుకుని సముదాయించడానికని దొడ్లోకి వెళ్ళిపోయాను.

మా వారు అప్పుడే ఆఫీసునుంచి యింటికి రావడంచేత ఆ డ్రెస్ మార్చి యింకో డ్రెస్ వేసుకుంటున్నారు. బాబిగాణ్ణి సముదాయించి ఆయనకు కాఫీ కలిపిద్దామని ఫ్లాస్కు దగ్గిరకెళ్లాను - ఫ్లాస్కు తీసి క్రింద పెట్టి గ్లాసు తెచ్చి పక్కనే పెట్టాను.

"అరెరె! బుజ్జి పబ్బంతా తగలేస్తోంది! దీన్ని లోపలికి తీసికెళ్ళవే," అంటూ పంపుదగ్గర కాళ్ళుకడుక్కుంటూ ఆయనగారు ఒక్క కేక పెట్టారు.

వెంటనే లేచి పంపుదగ్గర కెళ్ళాను. నన్ను చూడగానే అయిదేళ్ళ మొద్దు......ఆ బుజ్జి పరుగు ప్రారంభించింది. రెక్క పుచ్చుకుని ఒక్క గుంజుగుంజి తీసికొచ్చి యింట్లో తోలేశాను. దాంతో అది అరున్నొక్క స్వరంలో దీర్ఘం ప్రారంభించింది. ఆయన యెక్కడ విసుక్కుంటారో అని దాని ముందు యింత బెల్లంముక్క పడేశాను. ఇంతలో ఆయన కాళ్ళు మొహం కడుక్కుని వంటింట్లోకి వచ్చారు.

"అరె!......ఫ్లాస్కు క్రింద పెట్టి గ్లాసు పట్టుకు తిప్పుతావేమిటే!" అని ఆయన హెచ్చరించేదాకా నేను చేస్తున్నదని నాకే తెలియలేదు. ఫ్లాస్కును వదిలేసి మతిపోయి గ్లాసును పట్టుకుని మూతతీయబోతే ఎలా వస్తుంది?......

"అయ్యో!... నామతిమండా!" అనుకుని వెంటనే ఫ్లాస్కులో కాఫీ ఆయనకు పోసియిచ్చాను. ఆయన దాన్ని తాగుతూ పడకగదిలోకి వెళ్ళిపోయారు! ......మిగిలిన కాఫీ గ్లాసులో పోసి బుజ్జిముందు పెట్టాను.

---

"శాంతిశ్రీ"

---

"విమలా!...యిలా రా!...ఓసారి!..." అంటూ ఆయన ఓ కేక పెట్టారు...

కాఫీ అయిందికో బోలు యిక చెక్క డబ్బాకోసం కేకేశారేమోనని నేను వెళ్ళాను.

"అయితే యింతకూ ఆ మాలతి యెవరె!..." అంటూ ప్రశ్నించారు...

"ఎవరంటే ఏంచెప్పనండి?...ఏంచెప్తే మీకర్థమవుతుంది? అదకూడా నాలాగే ఓ ఆడపిల్లే..." అన్నాను ఆదోలా!

"అయ్యో! అలాగా!...నాలాగే మొగవాడేమోననుకున్నాను ... అయినా నువ్వు యింకా చిన్నపిల్లవయినట్లు మాట్లాడుతున్నావేమిటి పిల్లల తల్లివయి కూడా!..." అంటూ ఆయన నన్ను దెప్పి పొడిచారు.

"చాల్లెండి, మీ వేళాకోళం! పెళ్ళికాకపోతే యింకా పిల్ల అనే అనరా?..." అన్నాను నా వాదాన్ని సమర్థించుకుంటూ!

"సరేలే! పోనీ, యింతకూ ఆ ఆడపిల్లే, ఏ ఊరని?" అంటూ మళ్ళీ అడిగారు

"ఓహోహో! నన్ను విడిచిపెట్టేట్టు లేరే!" అంటూ విసుక్కోబోయాను.

"అంత కోపమయితే వద్దులే! పోనీ, ఒకవేళ ఆ పెళ్ళికి వెళ్ళాల్సి వస్తుందేమోనని. వెళ్ళక్కర్లేకపోతే పేచీయే లేదు..." అన్నారాయన.

"అయ్యయ్యో. ఎరక్కపోయి విసుక్కున్నానే" అని మనస్సులో అనుకుని,

"అబ్బే అది కాదండీ. ఆ మాలతిది మా ఊరే. మా యింటికి యెదురుగుండా ఉండేది. మీరు చూశారేమో కూడా" అన్నాను. పాపం, మా వారు వట్టి అమాయకులు! అంత కోపం వచ్చినా చల్లారిపోయింది.

"ఓహో, ఎఱ్ఱగా కోలగా మొహం, పన్నటి ముక్కు ఆ అమ్మాయేనా..." అంటూ ఆయన క్షణంలో తన మనస్సులో ఉన్న మా మాలతి యొక్క రేఖా చిత్రాన్ని నాకు వర్ణించి చెప్పేశారు.

"ఆ!...ఆ!...అదే!...దానికే పెళ్ళి..." అన్నాను నేను.

"అరె!...ఆ! అమ్మాయికా? పెళ్ళి... అదేమిటే?...ఎన్నేళ్ళుంటాయి యిప్పుడు" అంటూ ఆశ్చర్యంగా అడిగారు.

అవును. అందులో తప్పేంలేదు, ఆయన ఆశ్చర్యంగా అడగటంలో. నేను ఆశ్చర్యపడవలసిన విషయం లేదు. కారణమేమిటంటారా?...అదిగో యిదిగో అని అప్పుడే నా పెళ్ళయి పదేళ్ళు కావస్తోంది... అంటే నా పదిహేనో యేట పెళ్ళయింది. మాలతి అప్పటికి నా యీడుదే! అందుకని ఆయన గారలా అడిగారు.

"మరి!...పాపం, అప్పటినుంచి దానికి పెళ్ళికాలేదు. నా వయస్సే ఉంటుంది" అన్నాను.

"అయితే అదృష్టవంతురాలే! యిప్పటికైనా కళ్యాణం చేసుకొంటోంది!" అన్నారు నవ్వుతూ మా వారు.

"అది చేసికోనిదేమిటండీ? అంతా చిత్రం గాని. పాపం, అదేం ఖర్మోగాని దానికి యిన్నాళ్ళకి సంబంధాలు కుదరందే," అన్నాను జాలిగా.

"పోనీ, యిప్పటికి కుదిరిందిగా!" అన్నారు మా వారు.

అక్కడితో ఆ సంభాషణ ఆగిపోయింది. ఇంట్లో పనిచేసుకోడానికి నేను వెళ్ళిపోయాను. ఆయన కూడ షికారుకని ఊళ్ళోకి

 

# మాలతి పెళ్ళి



వెళ్ళిపోయారు. రాత్రి ఏడు గంటలకు భోజనాలు ముగించి వంటింటిలు గబగబ సర్దేసి పక్కకొచ్చాను. ఆయనగారేమో ఏదో ఆఫీసు పనుందంటూ వీధిగదిలో కూర్చుని ఆ ఆఫీసు కాగితాలు — కాగితాలేం ఖర్మం — కాగితాలకట్టలు—ముందేసుకు కూర్చున్నారు. బుజ్జి నాలుగు మెతుకులు నోట్లో పడగానే అక్కడే అపక్కనే నేలమీదే ఒరిగింది. వెంటనే దాన్ని తీసి పడుకోబెట్టే వ్యవధి లేకపోయింది. అందుకని దానికి పక్కవేసి దాన్ని లేవతీసి పడుకోబెట్టాను. ఇంతలో ఉయ్యాల్లో బాబిగాడు, అటు యిటు కదలసాగాడు. ఓసారి ఉయ్యాల ఊపి యివతలకు రాబోయాను.

"ఏమే!...మంచినీళ్ళు పట్రా!"—అంటూ ఆయనగారు వీధిగదిలోంచి ఆర్డరు జారీ చేశారు. మరచెంబుడు మంచినీళ్ళు ఓ గ్లాసు తీసికెళ్ళి ఆయనగదిలో పెట్టి తలుపు దగ్గరగా వేసి వచ్చి పడుకున్నాను. అమ్మయ్య ఇప్పటికి తీరిక చిక్కింది...ఛా! ఛా! మాలతి పెళ్ళి శుభలేఖ సరిగ్గా చదవనన్నా లేదే... వెంటనే పక్కమీదనుంచి లేచాను. లైటు వేశాను. వంటింట్లో పోపుల పెట్టెలమీద పెటిన శుభలేఖ తీసికొచ్చి మళ్ళీ మళ్ళీ చదివాను. ఎన్నిసార్లు చదివితే మాత్రం ఏం లాభం? ఏముంటుంది అందులో! అన్నీ ఒకటే కదా సరిగా! శ్రీరస్తుతో ప్రారంభించి మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ వరకూ అంతా ఒకటే అచ్చు! ఇకపోతే మారేదల్లా ముహూర్తము. వధూవరుల పేర్లు. మాలతి కొప్పోయే భర్త పేరు చదివాను... వామనరావు...అని ఉంది. పక్కనే బి. ఏ. బి. ఇడి. అని కూడా ఉంది. మాలతిభర్త యెలా ఉంటాడా అని ఊహించసాగాను. పేరుబట్టి మానే పొట్టిగా ఉండడుకదా కొంపదీసి!...అసలే పన్నం. అందులో పొడుగు. అజానుబాహు రాలు!...అలాంటి దానికి యీ పొట్టివాడైతే!

ఆ! పేరు వామనరావైనంత మాత్రాన మనిషి పొట్టిగా ఉండాలని ఎక్కడుంది?...అసలా మాటకొస్తే మనిషి పేరుకీ మనిషి స్వభావానికీ సంబంధం యెక్కడుంది యేడిసింది ఈ రోజుల్లో. ఆనందరావని పేరేగాని. అతన్ని ముఖంలోగాని, జీవితంలోగాని ఎన్నడూ ఆనందం కనపడదు ఒక్కొక్కడికి! సుమతీదేవి అని పేరు పెట్టుకుంటుందేగాని పాపం ఆ చిన్నదానికి అసలు మతే ఉండి యేడవదు ఒక్కొక్కతెకు నాలాగ!......అలాగ పేరుబట్టి భయపడక్కరలేదు. అలాగని నిర్లక్ష్యం చేయనూకూడదు...కొందరు సార్థక నామధేయు లుంటారు. నేను చదువుకునేటప్పుడు శాంతాదేవిగారనే టీచరుండేది. ఆవిడ దగరున్నంత శాంతం యింక యెవ్వరిలోను మనం చూడబోము. సరే యీగొడవకేం?... మాలతిభర్తనుగురించి ఆలోచిస్తూ పడుకున్నాను. దానిభర్త యెలా వుంటాడా అని ఆలోచన ప్రారంభించేసరికి మాలతి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. చిన్నతనంలో మాలతి అనేది తనభర్త సన్నగా నాజూగ్గా, పొడుగ్గా, అందంగా ఉండి, చక్కగా సూటు వేసి, గడియారం పెట్టి, రిమ్‌లెస్ కళ్ళజోడు పెట్టాలని చెప్పేది... మరి యీ వామనరావు దానికోర్కె ప్రకారం లభించాడో లేదో!... ఏమిటో యిలా ఆలోచిస్తుంటే మనస్సు మళ్లీ పన్నెండేళ్ళ వెనక్కిపోయింది.

అప్పుడు నాకు పదమూడు యేళ్ళు. మాలతికి పదమూడు యేళ్ళు. మాలతి మాయింటి యెదురుగుండా ఉండేది. అసలు ఆమాటకొస్తే మాలతి మాకు కొంచెం దగర చుట్టమే. ఇకపోతే మాయింటి పక్కన డాక్టరుగారు...వాళ్ళమ్మాయి సరోజా మాయీడుదే. అంటే మేంముగ్గురం ఒకేయీడు వాళ్ళం...ఇంచుమించు నెలల తేడాలో ముగ్గురం ఒక్కసారే పెద్దమనుషులయాము. పాపం మాలతి తల్లి ఎప్పుడో చనిపోయింది. మాలతికి అక్కయ్య, అన్నయ్య, తండ్రి ఉన్నారు. అప్పటికే మాలతి అక్కయ్యకు పెళ్ళయి కాపరానికివెళ్ళిపోయింది. అందుకని యిక యింట్లో వంటా వార్పు అంతా మాలతే తండ్రికీ అన్నయ్యకీ అన్నంవండి పెటటమే మాలతి పనైపోయింది. ఇక మాపనో: నా కుటుకు నాకు యిద్దరు అక్కయ్యలు ముగ్గురన్నయ్యలు ఉండడంచేత అమ్మనాన్నా నాచేత ఏపని చేయించేవారు కారు. ఇక సరోజసంగతి సరేసరి. డాక్టరుగారమ్మాయీ. పైగా సరోజతల్లికి సరోజంటే అతి గారాబం. సరోజకు ఒక అన్నయ్య మాత్రమే ఉన్నాడు. ఇలా ఉండగా నాకు మాత్రం నాన్న సంబంధాలు వెతకటం ప్రారంభించారు. మాలతి నాన్న ముందు చారవగా సంబంధాలు వెతకటానికి బయలేరలేదు. కారణం...? మాలతి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోతే తమకు వంటచేసి పెట్టే వాళ్ళుండరని. ఇక సరోజ తండ్రి-డాక్టరుగారు అంత శ్రద్ధ చూపలేదు. కారణం ఆయన భార్య! ఆవిడకు యెంతసేపూ కూతురిమీద వ్యామోహమే. పెళ్ళయితే యెక్కడ కాపరానికి వెళ్ళిపోతుందోనని సంబంధాలు వెతకనిచ్చేదికాదు. ఒకవేళ కుదిరినా కూతురు మాత్రం తనదగరే ఉండాలనేది. ఆవిడగారే కొడుకు పెళ్ళిచేసి కోడల్ని కూడా తనదగ్గరే ఉండిపోవాలని శాసించింది. తన కోడలు కూడా ఓయింటి ఆడబడుచేనన్న జ్ఞానం ఆవిడకు పాపం లేకపోయె! ఈ పరిస్థితులలో రెండేళ్ళయేసరికి నాకు మావారితో సంబంధం నిశ్చయమయి పోయింది. పెళ్ళికూడా జరిగిపోయింది. అప్పటికి మాలతికీ, సరోజకు సంబంధాలు కుదరవన్నా కుదరలేదు. సరోజ అన్నయ్యకు మాత్రం పెళ్ళయింది. సరోజ తల్లి కోడల్ని దగ్గరే ఉంచుకుంది!... వరిమిలాన నేను కాపరానికి వచ్చేశాను. ఆ తర్వాత మరుచటి సంవత్సరమే సరోజకు పెళ్ళిచేశారు. డాక్టరుగారి భార్య యిష్ట ప్రకారమే అల్లుడు అత్తవారింటి దగ్గర ఉండసాగాడు. ఆవిడగారు కోడల్ని ఒక్కసారి పుట్టింటికి పంపించడానికి కూడా యెంతో బాధపడేది. రెండేళ్ళకి మేమిద్దరం చంటిపిల్ల నెత్తుకున్నాము. మాలతికి యింకా అప్పటికీ యెక్కడా సంబంధం కుదరలేదు...మా పెళ్ళికి పూర్వం మేం ముగ్గురం కూర్చుని 'నీమొగుడుయెలాఉంటాడంటే నీ మొగుడు ఇలా ఉంటాడని ఏడిపించుకునేవాళ్ళం. అదృష్టవశాత్తు నాకు మాత్రం నాకు ఏడిపించినట్లుగా లేరు మావారు... సరోజకు అతురాలా అనుకొన్న మొగుడే దొరికాడు...అంత అందగాడు కాకపోయినా అనాకారి మాత్రం కాదు...అంత తెల్లని తెలుపు కాకపోయినా నల్లని నలుపు మాత్రం కాదు...అంత మరీ పొడుగు కాకపోయినా వామనమూర్తిలా పొట్టి కాదు...

అంత లావు కాకపోయినా కొంత మనిషి మాత్రం ఒకటే!– పీటికం వచ్చె!... అవలైవడి మా సరోజకి సిగరెట్లంటున్నా, సిగరెట్లు కాల్చేవాళ్ళన్నా తగని ఒళ్లు మంట...ఇక అలాంటిది చుట్టలు సంగతి వేరే వ్రాయాలా! అదేం అదృష్టమో కాని, దాని మొగుడికి పెళ్లియ్యేనాటికి పట్టుమని పాతికేళ్ళన్నా లేవు. ఆ వయస్సులో పాడు చుట్టలు అలవాటు అయాయి. ఎవరికైనా అలవాటయితే సిగరెట్లు అలవాటవుతాయి ఆ వయస్సులో. ఆయనగారు పెళ్ళిపందిట్లో, పెళ్ళయ్యాక లంకపొగాకు చుట్ట వెలిగించి తుప్పుకు తుప్పుకు మని ఉమ్మేస్తుంటే నాకే చిరాకెత్తింది. ఇక పాపం, ఆ సరోజ యెంత బాధపడి ఉంటుందో! ఈవిధంగా ముందు నా పెళ్లి, మరో సంవత్సరానికి సరోజ పెళ్లి అయ్యాయి. మాలతి మా యిద్దరి పెళ్ళిళ్లకు మంగళహారతి పాటలు పాడింది. మమ్మల్నిద్దర్నీ అత్తవారింటికి సాగనంపింది అంతరంగంలో అమాయకంగా బాధననుభవిస్తూ. కాలచక్రం దొర్లి పోక మానుతుందా? అయిదారు ఏళ్లవరకు మళ్ళీ మాకు ఉత్తర(ప్రత్యుత్తరాలు జరుగలేదు. ఉద్యోగరీత్యా మావారు అనేక ఊళ్లు తిప్పారు నన్ను. నా జన్మలో చూస్తాననైనా ఊహించని ఢిల్లీ, కలకత్తా ...ఒకటేమిటి, మన భారతదేశ కీలక స్థానాలన్నీ చూశాను. చూడ్డం ఏంఖర్మం...కాపరమే ఉన్నాను కొన్ని నెలలు. అలా అలా కొంతకాలంపోయాక ఓ సారి– అంటే మా శ్రీకాంతంబాబిగాడ్ని కడుపులో ఉండగా పురిటికి యింటికెళ్లాను. అప్పటి పరిస్థితి ఎంత విషాదకరంగా తయారయిందో తలచుకుంటే కడుపు తరుక్కుపోతుంది. మాలతికి యింకా పెళ్ళికాలేదు. పోనీలే!– ఆ కళ్యాణఘడియ యింకా కలిసిరాలేదు అని అనుకున్నాం. అంతకన్న అతిదారుణమైనది ...సరోజ భర్త చనిపోయాడు. ఊరు చేరగానే యీ వార్త తెలిసేసరికి కొయ్యబారి పోయాను. సరోజ నెలా ఓదార్చాలో అర్థంకాలేదు. అప్పటికే దాని కిద్దరు పిల్లలు. ఒక ఆడపిల్ల, ఒక మొగపిల్లాడు...అంతా పైకి విచారించినా, లోలోపల మాత్రం కొంతవరకు సరోజ తల్లిని ఆడిపోసుకున్నాను...కాకపోతే ఏమిటి చెప్పండి. ఎంత మమకారమైతే మాత్రం?—ఎంత కూతురైతేమాత్రం?...పెళ్లిచేసిన తర్వాత అత్తవారి యింటికి పంపించద్దూ?...ఏదో అమాయకపు అల్లుడ్ని చేసి యిల్లరికం ఉంచుకుంటుందా?...పోనీ తన కూతురిలాంటిదే తనకోడలుకూడా అని ఎన్నడైనా తలచిందా?...తనకు, తన భర్తకు, కూతురికి, అల్లుడికి చాకిరీ చెయ్యటానికి, కోడలు యెల్లకాలం యింటిలో ఉండాలా?...ఇదేమన్నా న్యాయంగా ఉందా? కూతురు ఎప్పుడూ తన దగ్గర ఉండాలని యేళ్ళే అవిడగార్కి దైవము తగినశాస్తిచేశాడు... శాశ్వతంగా యిక పాపం ఆచిన్న దాని జీవిత దీపాన్ని ఆర్పేసి, దానికడుపులో ఆరని చిచ్చు పెట్టి ముసుగేసిమూల కూర్చోబెట్టాడు...ఇక యెంత అఘోరిస్తే ఏంలాభం? చూడండి, దైవలీలలు!... ఒక తెరువు యింకా పెళ్ళే కాలేదు... వాకేమో నలుగురు పిల్లలు...పాపం దాని కష్టజీవితంలోని అతిముఖ్య ఘట్టాలన్నీ పూర్తయిపోయాయి. విధి విలాసం అంటే యిలాగే ఉంటుంది కాబోలు! ఆ ఊళ్లో అప్పుడు ఒక్కక్షణం ఉండబుద్ధి య్యలేదు...ఎలాగో ఆ పురుడు పుణ్యాలు పూర్తిచేసికొని నెల్లాళ్ళలో తిరిగి మా వారి దగర కొచ్చేశాను...ఆ తరువాలాని మళ్ళీ అక్కడి విషయాలు అంతగా తెలియలేదు...ఇవాళ అనుకోకుండా మాలతి పెళ్లి శుభలేఖ వచ్చింది. ఇన్నాళ్లకి దాని జీవితంలో (ప్రథమముఖ్యఘట్టం జరిగే అదృష్టం కలిందన్నమాట...ముహూర్తం యింకా మూడు రోజులుంది. ఏమైనా తప్పకుండా వెళ్లి తీరాలని అనుకున్నాను...అంతలో వంటింట్లో యేదో భళ్ళుమని చప్పుడయింది... "పిల్లి దుంపతెగ! తెగ (ప్రాణం తీస్తున్నాయి..." అని విసుక్కుంటూ తలుపు తీసి చూద్దునుగదా పాడుపిల్లి పెరుగుమూత పడదోసి యింత నాకేసి నా కెదురయింది...దాన్ని అవతలకు కొట్టేసి తలుపు గొళ్ళెంపెట్టి యివతల కొచ్చేసరికి బాబిగాడు లేచేశాడు. వాడికి కాసిని పాలు పట్టించి పక్కలో వేసేసరికి కళ్ళమీదకు నిద్ర కూడుకొచ్చింది. వెంటనే పక్కమీద వాలాను యిక ఆ రాత్రికి!

తెల్లారి లేచి యధాప్రకారం పను లన్నీ పూర్తిచేయసాగాను. ఆ సాయంత్రం ఆయన ఆఫీసునుంచివస్తూనే నాకో కవరు అందించారు. తీరావిప్పి చూద్దునుగదా అది మాలతి దగ్గర్నుంచే వచ్చింది.

"విమలకు,

విమలా!...విన్నావా మానాన్న పోరుతో నిన్న శుభలేఖ అందుకొని ఉంటావు...అరవై యేళ్లువచ్చాక చదువుకోక మున్నా కోట్లుకోనా అన్నట్టు, పాతికేళ్లపై బడ్డాక యిప్పుడు ఈ పెళ్ళి నిజానికి చేసుకోవాలని లేదు...కాని ఏం చెయ్యను? లోకాచారవ్యవహారాల ననుసరించి చేసుకోక తప్పదుగా! అందుకని నాన్నమాట కాదనక యీ పెళ్ళికి ఒప్పుకున్నాను...ఎక్కువగా ఎవర్నీ పిలవటం లేదు...నిన్ను తప్పకుండా పిలవాలని, నీవు తప్పకుండా [మీవారితో, పిల్లలతో సహా] రావాలని మూడురోజులు ముందుగా నీకు పోస్టుచేయించాను...మన చిన్నతనంలో

(47-వ పేజీ చూడండి)



శ్రీశైల ఆలయ గోపురం.

పోతున్నారేమో! తనని పట్టుకొని జైల్లో పెడ్తారేమో!...ఎలా? నలుగురు పిల్లలూ, భార్యా- ఏంకావాలి? తను లేకపోతే, తను ఏరోజూ రెండురూపాయలు ఇవ్వకపోతే ఎల్లా బ్రతుకుతారు?

'అతని మరణానికి తన అశ్రద్ధే కారణం! తనే కారణం! ఏ వర్లాంగుదూరంనుంచో తను జాగ్రత్తపడితే- అతను లారీక్రింద పడి వుండేవాడు. ఇప్పుడేంచేయాలి, తను! తన నేరం బయటపడదా? తను నేరస్థుడుగా న్యాయస్థానంలో నిలబడే అగత్యం కలుగదా?...ఆ సమయంలో ఎవ్వరూ లేరు. నేరం బయటపడేందుకు ఎటువంటి అవకాశమూ లేదు. తననేరం ఆరోజే ఆ అర్థరాత్రి చీకట్లో, గాలిలో కలిసిపోయింది. తను భయపడక్కరలేదు. ధైర్యంగా ఉండాలి. తనుచేసింది పాపంకావొచ్చు. తనవల్లనే ఆ దారుణం జరిగివుండొచ్చు. తన వల్లనే అతని జీవితం అంతమైవుండొచ్చు - కాని తను నేరాన్ని ఒప్పుకొని, న్యాయంగా, నీతిగా, నిజాయితీగా పోలీసుల ఎదుట పడలేదు. "నేనే అతన్ని హత్యచేసి శవాన్ని వంతెనక్రిందికి లాగింది నన్ను జైల్లో వేయండి. నా నేరాన్ని విచారించి శిక్ష విధించండి," అని పోలీసు స్టేషనుకు వెళ్ళి చెప్పలేదు. తను జీవించాలి. తను లారీడ్రైవరుగానే బ్రతకాలి. తను నలుగురు పిల్లల్నీ, భార్యనూ పోషించాలి. తను జైలుకు పోతే- వాళ్ళగతేం కాను? వాళ్ళని ఎవరు పోషిస్తారు? వాళ్ళు అడుక్కు తినవల్సిందేగా! తను ఎటువంటి పరిస్థితుల్లోనూ - నేరం ఒప్పుకోరాదు! తను నేరం చేసినట్టు ఎవ్వరికీ ఎరుక లేదు. కనుక తన నేరం బయట పడదు. తనకు శిక్ష లేదు. తను భయపడడం కేవలం అవివేకం! తను ఏ పాపమూ ఎరుగనట్లే ఉండాలి—అని గట్టిగా నిర్ణయించుకొన్న తర్వాత డ్రైవరు రామస్వామి గుండెమీద చేతులు తీసివేసి, తల పైకెత్తాడు. స్టీరింగు పట్టుకున్నాడు. లారీ స్టార్టు చేశాడు.

లారీనిండా సరుకు ఉంది. బందరులో దింపి రావాలి. రామస్వామి లారీని బందరు రోడ్డు పట్టించాడు.

*   *   *

గుండెను రాయిగా చేసుకోగల సామర్థ్యం మనుషుల్లో చాలతక్కువమందికి వుంటుంది. ఒక స్థితిలో చేసుకున్నా—మరో స్థితిలో జారిపోవడం కద్దు. లారీ డ్రైవరు రామస్వామి కూడా ఆ కోవకి చెందిన వాడు. నేరం బయటపడదనీ, శిక్షపడే అవకాశం లేదనీ, భయపడడం కేవలం అవివేకమనీ—ఎంత గాఢంగా నిశ్చయించుకున్నప్పటికీ, రోజులు గడిచిన కొద్దీ రామస్వామిలో పాపభీతి పెంపొందనారంభించింది. ఎప్పుడూ అదే ఆలోచన! ఆ నాడు అర్ధరాత్రి లారీలైటు వెలుగులో, నెత్తురు మడుగులో చూసిన భీకర దృశ్యమే—కళ్ళముందు మెదులుతూవుంది భారతదేశంలో పుట్టి, పెరిగిన వ్యక్తి ఒక నేరం చేసినా, దుర్మార్గం చేసినా, అవినీతికి పాల్పడ్డా—తాత్కాలికంగా ఆయా ఫలితాల్నుంచి తప్పించుకున్నా, చట్ట శిక్షలకు దూరమైనా, 'దేవుడూ, పాపమూ, కర్మఫలమూ' మొదలుగాగల అనంతమైన శక్తికి భయపడక తప్పదు. ఆ భయం ఆ వ్యక్తిలో పరివర్తనకు దారితీయనివ్వండి, పశ్చాత్తాపానికి కారణం కానివ్వండి, శిక్షకు దారి కానివ్వండి—వెంటాడుతూనే ఉంటుంది.

లారీడ్రైవరు రామస్వామి ఆ సంఘటన జరిగాక—తెనాలి గుంటూరు రోడ్డుమీదకు వెళ్ళలేదు. రెండుమూడు వారాలు డ్యూటీ మానుకున్నాడు. ఆ రోడ్డుమీద వెళ్ళాలంటేనే వొళ్ళంతా చలిజ్వరమొచ్చినట్టుగా వుంటున్నది.

రోజులు నిరాఘాటంగా గడుస్తున్నా, రామస్వామికి మటుకు ఆ ఆలోచనలు పోలేదు. లారీనడుపుతున్నా, భోజనం చేస్తున్నా, ఏపనిచేయబోతున్నా—ఘోరంగా చనిపోయిన ఆ మనిషే మనస్సులో మెదులుతున్నాడు.

తను లారీడ్రైవరు పనిమానేస్తే—హృదయంలో కొంత తగ్గుతుందనే ఆలోచన రామస్వామికి ఒక సాయంత్రం కలిగింది. మరునాడు లారీయజమానిదగ్గరకు వెళ్ళాడు.

"ఏం ఇటొచ్చావు. ఆ యాక్



# ★ నేరము - శిక్ష

కాదుగ వస్తే లేదా?" అన్నాడు యజమాని ఆశ్చర్యంగా.

డ్రైవరు రామస్వామి తలవంచుకున్నాడు విచారవదనంగా.

"ఏమైనా రోగం వచ్చిందా?"

లేదన్నట్లు తలవూపాడు.

"మరి—"

"పని—మానుకోవాలనుకుంటున్నాను,"
అన్నాడు మెల్లగా.

కళ్ళల్లో కొంచెం నీళ్ళు పడ్డట్లయింది యజమానికి.

"ఏం? ఎందుకు? జీతం చాల లేదా? జీతాలు దొరకడం లేదా?" కఠినంగా అన్నాడు యజమాని.

రామస్వామి మాట్లాడలేదు.

"ఇంకో ఎవరైనా ఎక్కువ జీతం ఇస్తామన్నారా?"

"లేదండీ... వ్యాపారం చేయాలనుకుంటున్నాను"

పొట్ట చెక్కలయేట్టు నవ్వాడు చాముండేశ్వరి లారీ సర్వీస్ యజమాని.

"వ్యాపారమా!... వేలకు వేలు గలవాళ్ళే పిల్లిగంతులు వేస్తున్నారు. ఏరోజు రూపాయితో ఆరోజు ఇల్లుగడిచే నువ్వు వ్యాపారం చేస్తావా? పిచ్చి పిచ్చి ఆలోచనలుమానుకో. బ్రతుకు జరుపుకు పోవడం నేర్చుకో. నీకు పిల్లలెంతమంది?"

"నలుగురు"

"నలుగురు పిల్లల్నీ, భార్యనూ పోషించాల్సిన బాధ్యత నీమీద ఉంది. దమ్మిడీ పెట్టుబడి లేకుండా—ఈ దేశంలో, నువ్వు చేసే వ్యాపారమేమిటి?.. వెళ్ళు. ఉన్న ఉద్యోగం పోయిందంటే నువ్వు చెడేది కాకుండా పిల్లల నోటిముందు కూడుకూడా ఎందుకు చెడగొడతావ్! వెళ్ళి లారీ ఎక్కు," అని చీవాట్లు వేశాడు యజమాని.

"ఓయ్, కయ్" మనకుండా డ్రైవరు రామస్వామి బయటకొచ్చి లారీ ఎక్కి చెంపలు వేసుకున్నాడు. తనలో కలిగిన పిచ్చివూహకు నవ్వుకున్నాడు.

తను వ్యాపారం ఏంచేయగలడు? వ్యాపారం చేయాలంటె పెట్టుబడి వుండాలి. పెట్టుబడిలేని వ్యాపారాలకు లాభాలు ఉండవు. తను ఏ ఉద్దేశ్యంతో యజమానిదగ్గరకు వెళ్ళాడు అయినే గనుక 'సరే. పనిమానుకొని వెళ్ళు' అంటే తనగతి ఏమిటి? పనికోసం మళ్ళీ వెదుకులాటేగా! ఆ భయంనించి తప్పించుకొనేందుకు తనకో బుద్ధి కలిగింది. తను డ్రైవరు పని మానేసినంతమాత్రాన—చచ్చిపోయినవ్యక్తి కళ్ళముందు మెదలక మానుతాడా! పాపం! అతనికీ సంసారం, పిల్లలూ, భార్య ఉన్నారేమో! వాళ్ళూ అతని రెక్కల సంపాదన మీద బ్రతికేవాళ్ళా! ఆ తల్లి ఎంత విలపించి వుంటుందో! ఆ పిల్లలు ఎంతగా అల్లాడిపోయి వుంటారో...! తను హంతకుడు! దుర్మార్గుడు! తనని పోలీసులు పట్టుకొని, ఉరిశిక్ష విధించినా— తను చేసిన తప్పుకు పాపం లేదు. తను మటుకు ఏంచేస్తాడు? ఆ అర్ధరాత్రితో అతని కర్మఫలం అట్లా కావాలని ఉంది కాబోలు! తన లారీక్రింద దిక్కుమాలిన చావు రాసిపెట్టివుంది కాబోలు! అనుకున్నాడు రామస్వామి.

చాముండేశ్వరీ లారీ సర్వీస్‌లోనే పని చేస్తున్నాడు డ్రైవరు రామస్వామి.

ఒకరోజు రాత్రి పదిగంటలకు తెనాలి మిలిటరీ భోజన హోటల్లో దిటంగా తిని లారీ ఎక్కాడు డ్రైవరు రామస్వామి గుంటూరు వెళ్ళేందుకు. లారీ యజమాని ఆదికేశవయ్య కూడా ప్రక్క సీటులోనే కూర్చున్నాడు.

బ్రేకుమీద కాలుపెట్టి స్టీరింగు పట్టుకొనేప్పటికి - రామస్వామి కాళ్ళూ, చేతులూ గజగజ వొణికినయ్. చెమటతో వొళ్ళంతా తడిసింది.

"ఊఁ! పోనియ్" అన్నాడు యజమాని ఆదికేశవయ్య.

స్టార్టు చేశాడు.



గాజుల మలారం

తను మళ్ళీ తెనాలి - గుంటూరు రోడ్డు మీద లారీ నడిపే అవసరం జీవితంలో రాదనుకొన్న డ్రైవరు రామస్వామికి, ఆరోజు యజమాని మొండితనంవల్ల ఆ అవసరం వొచ్చింది. అందులో అర్ధరాత్రి కావొస్తూంది. లారీ నడుపుతున్నాడన్న మాటే గానీ ఆలోచనలతో భయంతో బుర్ర బాగా వేడెక్కింది. స్టీరింగ్ చేతుల్లో నిలవడంలేదు. బ్రేకులమీద కాళ్లు గజగజలాడుతున్నాయి. లారీ నడుస్తూంటే రోడ్డంతా పెనగా ఎవరో చాప చుట్టినట్టుగా చుట్టుకు పోతున్నట్టుగా వుంది. రోడ్డుకు ఇరుప్రక్కలా ఉన్న చెట్లు దెయ్యాల్లాగా మీదపడతాయేమో ననిపిస్తున్నది.

కొలకలూరు వంతెన దగ్గరౌతూండగా— డ్రైవరు రామస్వామి గుండె సగం గొంతులోకి వొచ్చింది

.. ఇంకా మూడు మైళ్ళు. ఆ మూడు మైళ్ళు దాటితే—తన జీవితంలో ఘనవిజయాన్ని సాధించినట్టు. ఆ వంతెన దాటితే—తనలోని పాపభీతి ఏమీ చేయలేదు! ఎప్పుడైనా ఈ రోడ్డుమీదుగా రావొచ్చు. ఆ మూడు మైళ్లు తను దాటగలడో లేడో...?

షాప్ పేట దగర మురుగు కాలువ వంతెన ఇంకా మైలుదూరం వుండగానే—రామస్వామిలో పూర్తిగా మార్పు వొచ్చింది. ఆ మాగన్నులో కలలా చూశాడు యజమాని ఆదిశేషయ్య. తడబడుతూ రెండుసార్లు రోడ్డు ప్రక్క చింతచెట్టుకేసి లారీని వెళ్ళనిచ్చాడు. ఆదిశేషయ్య భయపడిపోయాడు.

"ఏమిటోయ్! అట్లా తూలుతూ బండి తోలుతావేం? వొంట్లో బావుండలేదా?" అన్నాడు ఆదిశేషయ్య తత్తర పడుతూ.

నవ్వాడు డ్రైవరు రామస్వామి. ఆ నవ్వు అర్థంకాలేదు ఆదిశేషయ్యకు.

ఇంకా కొన్ని ఫర్లాంగులు మాత్రమే వుంది ఆ వంతెన. డ్రైవరు రామస్వామి లారీ వేగం పెంచాడు. ఇరవై మైళ్ళలో వెళుతున్న లారీ యాభై మైళ్ళ వేగాన్ని అందుకుంది. లారీ దదరిల్లుతూన్నది. రోడ్డు విచ్చిపోతుందేమో నన్నట్టు కదలాడుతున్నది. చెట్లు విరిగి రోడ్డుమీద పడతాయా అన్నట్టు ఊగులాడుతున్నాయి.

ఆదిశేషయ్య గొంతు చించుకున్నాడు— లారీ ఆపుచేయమని.

రామస్వామికి ఆ అరుపులు వినపడలేదు. తను ఎంత వేగంలో లారీ నడిపితే—అంత వేగంలో ఆ వంతెన దాటగలడని అతని ఆశ.

... అదే వంతెన! అదే రైటు కాంతి! అదే రోడ్డు! అరె...అతను...వంతెన క్రింది నుంచి లేచివస్తున్నాడే!...చచ్చినవాడు... మళ్ళీ బ్రతికాడా! రోడ్డుమధ్యకు వొచ్చి నిలబడ్డాడేం? మళ్లీ లారీక్రింద పడతాడా! ఆఁ!...ఎందుకు నవ్వుతున్నాడు! ఎవర్ని చూసి! అదేమిటి? అట్లా గాలిలో ఎగిరి తన మీదకు చేతులెత్తుకుంటూ వొస్తున్నాడు... ఎందుకు?...ఆఁ! ఏమిటీ! తనని చంపాలనా! తనకు ప్రతీకారం చెయ్యాలనా!...ఆఁ!... అయ్యో! లారీమీదకు దూకుతున్నాడు... దెయ్యమై వాడు రోడ్డు ఖణ్ణకు పగిలింది!.. వంతెన కూలింది...వాడు దెయ్యమై మీదకు రానే వొచ్చాడు.

* * *

కెవ్వున కేక వేసి—డ్రైవరు రామస్వామి స్టీరింగు మీదనుంచి చేతులు తీసివేశాడు బ్రేకులమీది కాళ్లు తొలగి పోయినయ్. ఆదిశేషయ్య 'నారాయణా!. నారాయణా!' అంటూ కళ్ళు గట్టిగా మూసికొన్నాడు

వంతెన దాటలేక లారీ ఎగిరి మురుగు కాలువలో పడింది.

లారీడ్రైవరు రామస్వామి గుండె - లారీ వంతెన ఎక్కక ముందే ఆగిపోయింది.

లారీ కాలువలోకి బోల్తా కొట్టినా—లారీ యజమాని ఆదిశేషయ్య గుండె యధాతథంగా పనిచేస్తూనే ఉంది. లారీ డ్రైవరు చనిపోయినందుకు దుఃఖం లేదు గాని—లారీ పనికి రాకుండా విరిగి పోయినందుకు మంచం ఎక్కాడు ఆదిశేషయ్య. ★

# రాజు-రైతు




విజయుడి విజయోత్సవం
బ్రహ్మాండంగా జరిగింది-



విజయుడు వీరవర్మని మన్నించి సాగనంపాడు. తన విజయానికి కారకుడైన కన్నడికి తన ఆస్థానంలో ఉన్నత పదవి ఇచ్చాడు-




[అయిపోయింది]




[ఆదిపర్వము — పంచమాశ్వాసము]

క. ఇట్లు పాండవకౌరవు లొక్కట సంతతము గురుఁ డనుజ్ఞ గొని మృగయాలం
బట్టులై వనమున కరిగిరి, పటుతరజవసారమేయ భటనివహముతోన్.

వ. మఱియు నందొక్క భటునికుక్క తోడు దప్పి పఱచి యొక్కెడ నేకతంబ యేయుచున్న యేకలవ్యసమీపంబున మొఱింగిన నయ్యెలుంగు విని దానిముఖంబునం దేడు బాణంబు లొక్కటఁ దొడిగి యక్కజంబుగా నతిలాఘవంబున నేసిన నది శరపూరితముఖంబయి కురుకుమారులయొద్దకుం బాఱిన దానిం జూచి విస్మయం బంది యిట్లేసినవాఁ డెవ్వఁడో యని రోయుచు నచ్చువారు ముందఱ.

ఉ. కేవలబాణహస్తు దృఢదీర్ఘమలీమసకృష్ణదేహుఁ గృ
ష్ణాజినవస్త్రు నస్త్రవిషయాభ్యసితాఢ్యు నిషాదుఁ జూచి యా
రాజకుమారు లందఱుఁ బరస్పరవక్త్రవిలోకనక్రియా
వ్యాజమునం దదీక్షణనివారితులై రతిమత్సరంబునన్.

వ. అక్కుమారులు వానిశరలాఘవంబునకు మెచ్చి నీ వెవ్వండ వెవ్వరిచేత విలువిద్యఁ గఱచి తని యడిగిన వారికి నయ్యెఱుక యిట్లనియె.

క. వినుఁ డే హిరణ్యధన్వుం, డనువనచరనాథుకొడుక నాచార్యుఁడు ద్రో
ణునకుం శిష్యుఁడ నెందును, ననవద్యుఁడ నేకలవ్యుఁ డనువాఁడ మహిన్.

వ. అనిన విని కురుకుమారు లందఱు మగిడి వచ్చి ద్రోణున కంతయుఁ జెప్పి రంత నర్జునుం డేకాంతంబ యొక్కనాఁ డాచార్యున కిట్లనియె.

క. విలువిద్య నొరులు నీ క, గ్గలముగ లే కుండ నిన్నుఁ గఱపుదు నని ముం
బలికితిరి నాక కా దీ, త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెఱుకున్.

క. నాకంటెను నీకంటెను, లోకములో నధికుఁ డతిబలుండు ధనుర్వి
ద్యాకౌశలమున నాతఁడు, నీకుం బ్రియశిష్యుఁ డట యమిథ్యావచనా.

వ. అనిన విని యుదరిపడి ద్రోణుండు వానిం జూతము రమ్మని యర్జునుం దోకొని యనవరతశరాసనాభ్యాసనిరతుం డయి యున్న యేకలవ్యుకడ కేఁగిన నెఱిఁగి వాఁడు నెదురు వచ్చి ద్రోణునకు మ్రొక్కి తనశరీరంబు సర్వస్వంబును నివేదించి యేను మీ శిష్యుండ మిమ్మారాధించి యివ్విలువిద్యఁ గఱచితి నని కరంబులు మొగిచి యున్నం జూచి ద్రోణుం డట్లేని మాకు గురుదక్షిణ యిమ్మనిన నంతసిల్లి వాఁ డిట్లనియె.

క. ఇదె దేహం బిదె యర్థం, బిదె నాపరిజనసమూహ మిన్నిటిలో నె
య్యది మీ కిష్టము దానిన్, ముదమునఁ గ నిత్తుఁ గొనుఁ డమోఘంబనిశన్.

క. నెమ్మిని నీదక్షిణహ, స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యి మ్మి
ష్ట మ్మిది నా కనవుడు విన, యమ్మున వాఁ డిచ్చె దాని నాచార్యునకున్.

తే. దక్షిణాంగుష్ఠ మిచ్చిన దానఁ జేసి, బాణసంధానలాఘవ భంగ మయిన
నెఱుకు విలువిద్యకలిమికి హీనుఁ డయ్యెఁ, బార్థునకు మనోరుజయును బాసె నంత.

క. విలువిద్య నొరుల నీ క, గ్గలముగ లే కుండ నిన్నుఁ గఱపుదు నని ముం
బలరిపుసుతునకుఁ బలికిన, పలు కవ్విధమున గురుఁడు సేసెఁ బరమార్థముగన్.

మత్తకోకిలము. భూపనందను లివ్విధంబున భూరిశస్త్రమహాస్త్రవి
ద్యోపదేశపరిగ్రహస్థితి నున్న నందఱయందు వి
ద్యోపదేశము దుల్య మైనను నుత్తమోత్తముఁ డయ్యె వి
ద్యాపరిశ్రమకౌశలంబున దండితారి నరుం డిలన్.

క. అనిలాత్మజుబలమును న, ర్జునుకార్ముకకౌశలంబు శూరగుణంబుల్
మనమున సహింప నోపక, వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్.

## ద్రోణుఁ డస్త్రవిద్యం దనశిష్యులఁ బరీక్షించుట

వ. అక్కుమారుల ధనుర్విద్యాకౌశలం బెఱుంగ వేఁడి యొక్కనాఁడు ద్రోణుండు కృత్రిమం బయిన భాసం బనుపక్షి నొకవృక్షశాఖాగ్రంబున లక్ష్యంబుగా రచియించి దాని నందఱకుం జూపి మీమీధనువుల బాణంబులు సంధించి నాపంచినయప్పుడ యిప్పక్షితలఁ దెగ నేయుం డే నొక్కొక్కరన పంచెద నని ముందఱ ధర్మనందనుం బిలిచి యావృక్షశాఖాగ్రంబున నున్నపక్షి నిమ్ముగా నీక్షించి మద్వచనానంతరంబున శరమోక్షణంబు సేయు మనిన నతండును వల్లె యని గురువచనంబు సేసియున్న నయ్యుధిష్ఠిరునకు ద్రోణుం డిట్లనియె.

తే. వృక్షశాఖాగ్రమున నున్న పక్షిశిరము, దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ
యనిన నిమ్ముగఁ జూచితి ననిన వెండి,యును గురుఁడు ధర్మజున కిట్టు లనియెఁ బ్రీతి.

క. జననుత యామ్రానిని న,న్నును మఱి నీభ్రాతృవరుల నుం జూచితె నీ
వనవుడుఁ జూచితి నన్నిటి,ననఘా వృక్షమున నున్న యవ్విహగముతోన్.

వ. అనిన విని ద్రోణుండు ధర్మజుం బదరి నీదృష్టి చెదరె నీవు దీని నేయ నోపవు పొ మ్మని యివ్విధంబున దుర్యోధనాదు లైనధార్తరాష్ట్రులను భీమసేననకులసహదేవులను నానాదేశాగతు లయిన రాజపుత్త్రులను గ్రమంబున నడిగిన వారలు ధర్మనందను చెప్పినట్ల చెప్పిన నందఱనిందించి పురందరనందనుం బిలిచి వారి నడిగినయట్ల యడిగిన నాచార్యునకు నర్జునుం డిట్లనియె

క. పక్షిశిరంబు దిరంబుగ, నీక్షించితి నొండు గాన నెద్దియు ననినన్
లక్షించి యేయు మని సూ,క్ష్మేక్షణు ద్రోణుండు పనిచె నింద్రతనూజున్.

క. గురువచనానంతరమున, నరుఁ డప్పుడు శరవిమోక్షణము సేయుడుఁ జె
చ్చెరఁ బక్షిశిరము దెగి తద్ధరణీరుహశాఖనుండి ధారుణిఁ బడియెన్.

వ ఇట్లు క్రమంబునఁ గృత్రిమపక్షితలఁ దెగ నేసినయర్జును నచలితదృష్టికి లక్ష్యభేదిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేదరహస్యంబు లుపదేశించె నంత.

క. మానుగ రాజకుమారుల,తో నొక్కట నొక్కనాఁడు ద్రోణుఁడు గంగా
స్నానార్థ మరిగి యందు మ,హానియమస్థుఁ డయి నీళ్ల నాడుచు నున్నన్.

క. చలచలన నీరిలో నొ, క్కలగా నొక మొసలి చూడ్కి కగోచర మై
పలతెంచి కుంభసంభవు,చిఱుదొడ వడిఁ బట్టికొనియె శిష్యులు బెదరన్.

క. దాని విడిపింప ద్రోణుఁడు, దా నపుడు సమర్థుఁ డయ్యుఁ దడయక పనిచెన్
దీని విడిపింపుఁ డని నృప,సూనుల శరసజ్యచాపశోభితకరులన్.

శా. దానిన్ నేరక యందఱున్ వివశు లై తా రున్న నన్నీరిలోఁ
గానం గానిశరీరముం గలమహోగ్రగ్రాహమున్ గోత్రభి
త్సూనుం డేనుశరంబులన్ విపులతేజుం డేసి శక్తిన్ మహా
సేనప్రఖ్యుఁడు ద్రోణుజంఘ విడిపించెన్ విక్రమం బొప్పఁగన్.

వ అమ్మహోగ్రగ్రాహంబు పార్థబాణపంచకవిభిన్నదేహం బయి పంచత్వంబుఁ బొందినం జూచి ద్రోణుండర్జును ధనుఃకౌశలంబునకుఁ దనయందలి స్నేహంబునకు మెచ్చి వీనిచే ద్రుపదుండు బంధుసహితంబు పరాజితుం డగునని తన మనంబున సంతోషించి వానికి ననేక దివ్యబాణంబు లిచ్చె నని యర్జును కొండుకనాఁటిపరాక్రమగుణసంపదలు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పెనని

# గంగమ్మ శపథం

గోవిందరాజు శ్రీనివాసమూర్తి

ఒకరోజు సూర్యాస్తమయ సమయాన పెరుగాలి నిమిత్తం చేల గట్టువైపుకి వచ్చిన నాయుడు విలాసంగా మీసం దువ్వాడు. మత్తెక్కించే పైరుగాలి జోరుకి తట్టుకోలేక కళ్ళు అదోలా అయిపోయి, గడ్డి మోపు భుజాన వేసుకుని, ఓ చేత్తో కొడవలి వయ్యారంగా తిప్పుకుంటూ, జోరుగాలికి చీర రెపరెప లాడిపోతూ, అతివయ్యారంగా గట్టంట నడిచివస్తున్న గంగమ్మను ఇట్టే పసికట్టి, కళ్ళు మత్తెక్క, అట్టే రెక్క పుచ్చుకున్నాడు.

అనుకోకుండా జరిగిన ఈ సంఘటనకు గంగమ్మ ముందు నివ్వెరపడి, తర్వాత మండి పడి, నాయుణ్ణి చంప ఛెళ్ళుమనిపించింది.

ఈ దృశ్యాన్ని ఎవరు ఎలా పసిగట్టారో గాని అంచెలమీద ఊరంతా పాకిపోయింది.

"నాయుడికి ఏం పొయ్యేకాలం," అంది మారమ్మ పక్కింటి నాంచారమ్మతో.

"చంప ఛెళ్ళుమంటే బండారం బయట పడింది. గంగమ్మంటే తక్కువదా!" అంది నాంచారమ్మ.

ఇది మచ్చుకి మాత్రం.

ఇలా ఊరంతా దుయ్యబట్టటంతో నాయుడికి పంతం వచ్చింది. చంప ఛెళ్ళుమనిపించిన చిన్నదాని పొగరణచందే నిద్రపోనని శపథం చేశాడు—ఇదికూడా తంతివార్తలా పాకింది ఊరిమీద.

"విన్నావురా, నాగిగా, ఆ నచ్చినోడి మాటలు. రొయ్యకు లేదూ బారెడు మీసం. వచ్చిపోతూ చూసొస్తే అదిసంగతి కనుక్కోరాదూ," అన్నది గంగమ్మ తన మేనత్త కొడుకు నాగిరెడ్డితో.

"ఏందే, నన్ను బంపుతావ్. పొద్దుపోయి చేల గట్టుకెళ్లే అంటే ఎందుకే లావక్కి? ఇంకోనయం. రెక్క పుచ్చుకోటంతో వదిలేడు... నీకైతేనా." అంటూ విసుక్కున్నాడు నాగిరెడ్డి.



# ★ గంగమ్మ శపథం ★

కళతో తెలియటం లేదు. ఉటికొట్టే సంబరం చూడవచ్చిన నాగిరెడ్డి మిరిచెట్టు మొదట నిలుచున్నాడు. అతడికి అరవై బారల దూరంలో నుంచున్న పదిమంది ఆడంగుల్లోనూ ఆరోది గంగమ్మ. ఎర్రంచు అద్దకం ముల చీరకట్టింది. రవిక జరీఅంచు పట్టు – మొఖాన అర్ధరూపాయంత బొట్టు – గుడ్డి వెలుగులో కూడ మెరుస్తున్నది.

"గంగమ్మంటే కావ్రాత్తా మా ఊరి లచ్చే" అనుకుని తనలో తనే సన్నగా నవ్వుకున్నాడు నాగిరెడ్డి.

ఆ నవ్వును గ్రహించింది గంగమ్మ.

"వచ్చినోడు ఇకిలిత్తన్నాడు," అని లోలోనే అనుకుని మారు నవ్వింది.

ఆ నవ్వుతో రెడ్డి కళ్ళు గుర్రుడిచి ఏంచేయాలో తోచక సిగుపడిపోయాడు.

గుడ్డివెలుగులో జరుగుతూన్న ఈ చూపులూ, నవ్వులూ క్షణంలో అంతమైనై. ఒక్క పెట్టున రెండు పెట్రోమాక్సు లైట్లతో సహా తీవి ఒలకబోసూ నాయుడు వస్తున్నాడు. "అదుగో నాయుడంటే అదుగో వాడయ్యు" న్నారు. నాయుడిపేరు ఏమిటానా తలచినా తలచకపోయినా ముఖ్యంగా కృష్ణాష్టమికి ఉటికొట్టే సంబరంనాడు తాతయ్యల దగ్గర్నుంచి పసిపిల్లల దాకా నాయుడి నామం జపించి తీరాల్సిందే. ఎందుకంటే ఉట్టికొట్టటంలో దిట నాయుడొక్కడే! అయిదారు కృష్ణాష్టములు ఏకధాటిగా నాయుడే ఉట్టగొట్టాడు. వందలమంది హేమా హేమీల ప్రయత్నాలు వ్యర్థాకాగా అవలీలగా కొట్టగలిగింది నాయుడొక్కడే!

పెద్దాపురం సిల్కులాల్చి తొడిగి, జరీ అంచు జామారులో ఉన్న నాయుడు ఘుమ ఘుమ లాడుతున్నాడు "అతగా పులిమిండోస్," అన్నది గుంపులోంచి ఓ కంఠం.

"ఉటిపగిలితే నీళ్ళు కారతైగందా, చిలుకుచాక్కా ఎందుకు," అని ఎవరో అనబోతుంటే "ష్" అన్నది మరో కంఠం.

ఇవేమీ పటంచుకోలేదు నాయుడు.

పెద్ద పెద అంగల్తో ముందుకొచ్చి ఉటిని ఓమారు తేరిపారచూసి సన్నగా నవ్వి ఎందుకో ఎవరికోసమో కలియ వెతుకుతున్నాడు.

"దొంగచూపులు," అనుకుంది గంగమ్మ అమూల ఓరగా నిలబడి ఓరకంటితో.

పెట్రోమాక్సు లైట్లు పైకి లేచాయి. ఫెళుమంది వెంకాయ. కళ్ళు తెలిచుని నాయుడి కళ్ళు ఇంకా ఎందుకో వెతుకుతూనే ఉన్నయ్. ఝల్లుమంటున్నది నాగిరెడ్డి మనసు భయంతో.

జనం తిండోప తిండాలుగా చేరి విరగబడి చూస్తున్నారు. ముందు చాకలిసుబ్బన్న ఉటికోసం ఎగిరాడు. అందలేదు. వీరిగాడు అసలు ఎగరలేకపోయాడు. జంగమయ్యకు జానెట్లో తప్పింది. ఇలా డజనుమంది ప్రయత్నించి సిగుపడారు.

"నాయుడోయ్, కొటెయ్," అన్నారు ఎవరో పెద్దగా.

ఇందుకోసమే ఎదురుచూస్తూన్న నాయుడు చేతికర్ర అవలకు విసిరి మళ్లీ ఓమారు ఉటికేసి చూశాడు. ముప్పైబారలు వెనక్కు వెళ్లాడు. జనం గుసగుస లెక్కువై మరీ గల్లంతుగా ఉంది. "తప్పుకోండెహె," అంటూ నాయుడు రివ్వున పరుగెత్తుకొచ్చి ఎగిరి చేయివిసిరాడు. "హో, హో" అన్నది గుంపు, కాని ఉటి అందలేదు. సిగ్గుపడ్డాడు నాయుడు.

"ఈమాటు నూత్రా; నా తడాఖా సూపితా," అంటూ అక్కడే ఐదుబారల దూరంలో మెత్తగా నవ్వుతున్న గంగమ్మ కేసి విటారుగా ఓచూపు చూసి, మళ్ళీ అవలకు మళ్లాడు. ఈ పట్టూ అంతే అయింది ఉటి అందలేదు.

"మీసం దువ్వంగానే సరా," అని లోపలే అనుకుందా మనుకున్న గంగమ్మ ఆ మాట పైకి నేసింది.

ఇది విన్నాడు నాయుడు. ఆ క్రోధంతో మళ్ళీ లగత్తి గంతేశాడు. కాని ఉట్టి అందలేదు

పెద్దగా నవ్వింది గంగమ్మ.

మిరిచెట్టుకింది నాగిరెడ్డికూడా నవ్వాడు.

గుంపులోంచి మెల్లిగా అడుగులు వేసుకుంటూ గంగమ్మ నాగిరెడ్డిని సమీపించింది.

"ఇకిలిత్తూ కూకోపోతే నువ్వు కొట్టకూడదూ," అంది.

"నాకిడ కొత్తవుద్ది; నేను పాటి."

"తింటానికి తింటావు అడెను బియ్యం."

"తింటే ఎగరగలమా ఏంటి? పెగా అదు రుసరుసలాడన్నాడు." అన్నాడు నాయుణ్ణి చూసి నాసెల్ ప్రుట్టిరెడ్డి

"పావు," అంటూ చిరాకుతో అవతల కెళ్ళింది గంగమ్మ.

పంతం వచ్చింది రెడ్డికి.

"కొకట్టుకున్నా ననుకుంది గావాల్ని," అంటూ "హం" అని తలగుడ తీసి మొలకు చుట్టి ముందుకొచ్చి "నే ఉటికొడతా," అన్నాడు గుంపు గుండెలు అదిరేట్టు...

నిజంగానే అదిరిపడ్డది గుంపు. నాయుడుకి చాతకాని పని ఈయనెవడికి చాతవుతుందా అన్నట్టు నవ్వింది.

'ఏడికాడు, ఎదవ," అన్నాడు నాయుడు. కొందరు రెడ్డిని దువ్వి ముందుకు తెచ్చారు.



"కోడి పందెము"

# ★ గంగమ్మ శపథం ★

కావలే!—ఇలా ఊహించుకుంటున్న నాయుడు గంగమ్మను సమీపించాడు.

అప్పటికి మూడు బిందెలు ఇంటికి చేర వేసి ఆరుమాట్లు నాగిరెడ్డి నవ్వులకు జవాబుగా నవ్విన గంగమ్మ, నాలుగో బిందె నడ్డి మీదకెత్తి ఏడోమాటు రెడ్డి నవ్వు గ్రహించి జవాబుగా నవ్వబోతున్న సమయంలో ఎదురుగా ఉన్న ఆరున్నర అడుగుల నాయుడూ జర్రున ఆమె రెక్క పుచ్చుకుని జర్రున దగరకు లాక్కున్నాడు "నామీద కోప మెందుకు గంగమ్మా," అంటూ మెత్తటి ఊసులాడబోతున్నాడు.



తక్కువ, ఊహించని ఈ పరిస్థితికి తట్టుకోలేకపోయింది గంగమ్మ.

"నాయనోయ్—నాయుడు నన్నట్టుకుంటన్నాడోయ్," అంటూ పెద్ద దద్దరిల్ల కేక పెట్టి చేతిలో ఉన్న బిందె ఎత్తి అపర అంకమ్మలా తిప్పి నాయుడి నడినెత్తిన బాదింది. ఇది ముందే ఊహించుకున్నాడేమో, తల చిల్లడంత పనయినా నవ్వుతూనే ఉన్నాడు నాయుడు. బిందెలోని నీళ్ళు కారి ఒళ్ళంతా తడిసి మరీ మత్తెక్కించింది నాయుణ్ణి. మళ్లీ గంగమ్మ రెక్క పుచ్చుకోపోతున్నాడు.

ఒక్క క్షణంలో జరిగిపోయిన ఈ దృశ్యానికి నివ్వెరపడ్డాడు మూలగా సావిట్లో కూచున్న నాగిరెడ్డి. నోటో పందుంపుల్ల దానంతట అదే జారిపడింది. రెండోమాటు నాయుడు గంగమ్మ రెక్క పుచ్చుకుంటున్న వైనం చూసిన రెడ్డి కళ్ళబైరు తొలగిపోయినై. కోపంతో వణికిపోయాడు. పర్రున బాణంలా లేచాడు. రివ్వున అక్కడకు దూసుకు వచ్చి ఊరు మారుమోగేటు తొడగొట్టాడు:

"ఇయ్యాల నువ్వో నేనో తేలిపోవాలి; రా." అంటూ.

కందిపోయేట్లు తొడలు అయిదారుమాట్లు బాది నాయుణ్ణి జుట్టు పుచ్చుకున్నాడు. నాయుడూ ఊర్కోలేక తిరగబడ్డాడు. దీంతోటె శివం ఎత్తింది రెడ్డికి. వెయ్యేనుగుల బలం వచ్చినట్టయింది. నాయుణ్ణి వంచి పెట్టి మోకాటితో అతడి ముఖంమీద ఫెడీమని తన్నాడు. నాయుడిముఖం ఆ దెబ్బతో చితుకుపోయి బొటబొట రక్తం కారుతున్నది. దెబ్బమీద దెబ్బ—ఆరుమాట్లు. నాయుడివళ్లు హూనం అయింది. లేచే ఓపిక లేదు

"బాబోయ్ నాగిగాడు చంపుతున్నాడోయ్," అని కేకలు.

ఇదంతా గమనిస్తున్న గంగమ్మ మితిలేని సంతోషంతో నాయుడిదగ్గరకు పరుగెత్తి అతడిరక్తం చేత నంటించుకుని అంకమ్మ ఆలయంవద్దకు ఒక్క గంతేసింది.

"నా పంతం తీరింది నాయమ్మా. చూశ్కో ఆడి రగతం తెచ్చా," అంటూ ఆ రక్తాన్ని అంకమ్మ ముఖంమీద ఇంత కొత్తి తనింత మెత్తుకుని సాష్టాంగపడి, "నా వోడు నాగిగాడు, ఆణ్ణి నా వోడిగా సెయ్ నాయమ్మా," అని నేలమీద ముఖం బాదుకుని, ఇవతల కొచ్చేసరికి అంకమ్మే స్వయంగా వచ్చినట్టయింది. అప్పటికి బారెడుపొద్దూ ఎక్కింది. జనం విరగబడి చూస్తున్నారు ఆమెను. "ఏంది గంగమ్మా, ఏమైంది?" అంటే మాట్లాడదు.

నిముషాలమీద ఊరంతా పాకిపోయింది జరిగినవిషయం.

"దెసంతే ఏమో అనుకున్నాం," అని ముక్కున వేలేసుకున్నది గ్రామం.

మర్నాటినుంచీ నాగిరెడ్డి మొనగాడయ్యాడు మీసం మెలెయ్యటం నేర్చుకుంటున్నాడు.

ఓ రోజు సాయంత్రం చేలగట్టంట, హుషారుగా పాడుకుంటూ వస్తున్న నాగిరెడ్డి హోరుగాలిలో విలాసంగా కొడవలి ఊపుకుంటూ వయ్యారంగా నడిచివస్తున్న గంగమ్మను "ఏయ్, ఆగు," అంటూ జబర్దస్తీగా జబ్బ పుచ్చుకున్నాడు.

గంగమ్మ నోరెత్తితే ఒట్టు. ★

# నక్షత్ర ఫలితాలు

[28 1-59 మొదలు 3-2-59 వరకు]

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| కే | | గు | |
| శు | సింహ, కన్య, తులా వృశ్చికములలో చంద్రుడు | | |
| ర బు | | | |
| కు | శ | | రా |

*** అశ్వని [చూ, చే, చో, లా] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. బుద్ధిబలము నుపయోగించి ప్రయత్నించినను కార్యసిద్ధి వుండదు. చేతికివచ్చే డబ్బు అవసరములకు సరిపడక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వుందని విని వ్యాకులపడతారు. ఐనను దైవానుగ్రహముచే అన్ని పరిస్థితులయందే మనోనిబ్బరముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన 28 29 30 నిలకడలేని స్థితి, ప్రయాణము, 31 ధనఆప్తి, పుణ్యక్షేత్ర సంచారము, సత్ సాంగత్యము 1 న ఆరోగ్య చింత

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈ వారము అనుకున్నట్లుగా సౌఖ్యమేది రాకపోవుటచేతను, ఖర్చులు ఎక్కువగుటచేతను అశాంతి కలుగుతుంది. కోరు వ్యవహారములు కొంతవరకు అనుకూలిస్తవి ఉద్యోగస్తులకు అధికారుల తొందరలు. వర్తకులకు అశాంతి. భార్యకు ఆరోగ్యము భాధింపను. వ్యవహార పరిష్కారములో దుష్ట్రులతో వివాదము. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ. 28 కార్యభారము, త్రిప్పట 1 వివాదము, ఆరోగ్యచింత, 2 3 ధన లాభము కార్యసిద్ధి.

*** కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] ***

తలకుమించిన పనులను పైని వేసుకుని కార్యసాధన అయినప్పటికి నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి, ఫలమును పొందుతారు. సోదరసహాయము కొంత అనుకూలతనిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకు మాటలచే మనోవ్యధ కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి. ప్రమాదముల వలన గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువులు వ్యాపారస్తులకు గనుల యజమానులకు లాభము. 1 ప్రమాద సూచన. 28, 29 కార్యభారము. 2, 3 సోదర సహాయము.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈ వారము మీకు యోగకాలము. బంధు సహాయము. అధికారుల సహాయము కలుగుటచేత ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు నటీనటులకు మేలు కాలము

## బి. నరసింగరావు

*** మృగశిర [వే, వో, కా, కి] ***

ఈ వారము మీకు మంచి భాగ్య యోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. యిబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల బాగుకొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన ఉద్యోగులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలు కాలము.

*** ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] ***

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీతసభలు, కవితాగోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభ కార్యాలలో పాల్గొంటారు. నూలు, బటలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు మేలుగా వుంటుంది.

*** పునర్వసు [కే. కో. హా. హీ] ***

ఈ వారము యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభ పుణ్య కార్యాలలో పాల్గొంటారు. నూతన గృహ నిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడియున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. వారాంతమున స్త్రీలతోనూ మిత్రులతోనూ విందూ వినోదము.

*** పుష్యమి [హూ. హే. హో. డా.] ***

ఈ వారము రాబడి ఎక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి. అనారోగ్యసూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందవలెను, రవికి శాంతి చేయించవలెను మంచిది. వుద్యోగస్తులకు కొంత సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గమునుండి సహాయము, కార్యలాభము కలుగుతవి.

*** ఆశ్రేష [డీ. డూ. డే. డో] ***

ఈ వారము మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము అవుతుంది. ధనలోపమువల్ల ఆందోళన యింట్లో ఉన్నవారి అనారోగ్యమువల్ల అశాంతి కలుగుతుంది. వుద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా వుద్రేకముతో వుంటుంది. విదేశీయుల పరిచయము. అపురూప వస్తుసంపాదన కలుగుతవి. 1 న ఎక్కువ ఖర్చులు మనోవ్యధ.

*** మఖ [మా మీ మూ మే] ***

ఈ వారము ఆశించిన సహాయము లభించక అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. అయినప్పటికి దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల ఆనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా వున్నా వస్త్రద్రవ్యలాభము పొందుతారు. 1 న అధిక ఖర్చులు.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***

**(మో, టా, టీ, టూ)**

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత

 

# నక్షత్రఫలితాలు



ఎక్కువ. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదములు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా అమిత ఖర్చులవల్ల సంతోషముండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె. వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 1 న బంధువులరాక, అధిక ఖర్చులు.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యాలకు ఆటంకము కలుగుతునే వుంటుంది. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి, దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చు. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు, భూస్వాములకు, కష్టముతో కూడిన లాభము, పోలీసుశాఖ ఉద్యోగస్తులకు మేలు కాలము. 1 వ ప్రమాద సూచన.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారం మీకు యోగదాయకం. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమ సమాచారము తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము, గణిత, జ్యోతిశ్శాస్త్ర చర్చలు వంటివి జరుగుతాయి. ప్రత్తి - దూది - నూలు - బట్టలు - ఇత్తడి - కంచు - వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలు కాలము. 29,30 అధిక ఖర్చులు.

### *చిత్త [పే, పో, రా, రి]*

ఈ వారము మీకు శుభయోగము. ఆశించినసొమ్ము చేతికివస్తుంది. ఇంటో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ - ప్రభుత్వసన్మానము. వైద్యజ్యోతిష శాస్త్రములవంటి ప్రసంగములు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశములు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగావున్నా, కొంత ఆందోళన కూడ వుంటుంది. పిల్లల క్షేమమునకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము మీరు తలపెట్టిన కార్యములలో జయము పొందుతారు. వెండి పాత్రలలో మృష్టాన్న భోజనము బంధు మిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి-దూది-నూలు-బట్టలు-వెండి-బియ్యము, ద్రవపదార్థ జనిత వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు-నటీనటులకు మేలుకాలము-29-30 అధిక ఖర్చులు.

—ధరలు:—

నూలు వస్త్రములు: మార్పులేను
నూనెగింజలు: సమస్థాయిలో వుండును.
ఆహారధాన్యములు: నిలకడగా వుండును.
బెల్లము, చింతపండు, పంచదార: మందముగా వుండును.
పప్పుదినుసులు: చురుకుగా వుండును
వెండి, బంగారము: స్వల్ప తేడాలలో వుండును.
దక్షిణప్రాంతములలో అచ్చటచ్చట చెదురుగా వర్షించును.

* * *

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. విష్ణువను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృష్ణి అను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భార్గవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### * విశాఖ [తీ, తూ, తే, తో]

ఈ వారము మీకు యోగప్రదము ధనధాన్యవృద్ధి వుంటుంది. వివాహాది శుభకార్యములలో పాల్గొంటారు. ఇష్ట వస్తు లాభము. పరోపకారమువల్ల కీర్తి కలుగుతుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమితలాభము పొందుతారు. వాహనయోగము కలుగుతుంది. కవులకు గాయకులకు-నటీనటులకు కళాకారులకు యోగకాలము. 1 న కుటుంబ కలహము.

### అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింత మాటలు వినుట పరాక్రమమువల్ల ఘనత-ప్రయాణము-ధనలాభము వుండును. అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్థులకు స్వల్ప అనుకూలత-విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా ఆందోళనతో పాటు అనుకూలత. 1 ని అనారోగ్యము.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము తలపెట్టిన పనులు నెరవేరవు. ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్యట

ప్రాంతములకు బదిలీఅయే సూచన లున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగింపబడతారు. వారమంతా చికాకుగావున్నా వారాంతములో విదేశీయుల సహాయమువల్ల కార్యసిద్ధి జరుగును.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈవారము ధనాభావము ఎక్కువ ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలమువలన క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. వుద్యోగస్తులకు ఒత్తిడి వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఎంత ఆందోళనవున్నా, సాధుసజ్జన సాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము-నష్ట ద్రవ్య లాభము కలుగును.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]***

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తవి. కోరుదావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి పోగాక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా వుండదు. యిచ్చిపుచ్చుకునేపట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి వున్నా, తోటివారి సహకారం లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున లాభము. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన ధనం సమయానికి అందక అప్పుచేస్తారు. ఆత్మీయులవల్ల నిందల పాలౌతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యాజమానులకు భూసామ్యములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, రంగుల లోహ పుపాముములు, వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. 1న ప్రమాదభయం.

*** శ్రవణము [జూ, జే, జో, ఖా]***

ఈ వారం మీకు యోగప్రదము. బంధువుల సహాయములోనూ అధికారుల సహాయంతోనూ, ఆటంకములు గడిచి, ఫలంపొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమం తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము. కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 2, 3 తేదిలలో ధనలాభము కార్యసిద్ధి.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో కొంత అనుకూలము వుంటుంది. పండితగోష్ఠి జరిపి, నూతనవిషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనతో కూడి వుంటుంది. 31. ధనలాభం. 2, 3 పుత్రుల అభివృద్ధి. 1 అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన వుద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధి-క్షీర-మధుర-పదార్థయుక్త భోజనము రజతపాత్రలలో భుజించుట. తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణం, తెలని వస్త్రములు కొనుట, మొ|| యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి. బియ్యము, ద్రవపదార్థ క్రయవిక్రయములలో వర్తకులకు, లాభము-కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు, మేలుకాలము. విద్యార్థులకు మంచికాలము. వారాంతమున అధిక ఖర్చులు ఆందోళన.

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారము ధనధాన్యవృద్ధి – పశువృద్ధి కృషిమూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగము, కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా, చదువు బాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందూ వినోదము. 1 న కుటుంబ కలహము.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము మీకు కార్యభారముఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరవందున కలతలు. ఆరోగ్యము సరిగాలేని కారణంగా కవబడగానే ఔషధచికిత్స పొందడమేకాక, గ్రహారాధన రవికి శాంతి చేయించుట మేలు. వుద్యోగస్థులకు క్రొత్త సమస్యలు-వర్తకులకు ఆందోళన విద్యార్థులకు చదువు సరిగాసాగదు. 31 పితృవర్గ సహాయము, కార్యలాభము. 1 ఆరోగ్యభంగము, అధిక ఖర్చులు, రాజకీయవాదులకు ఆందోళన.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగావున్నా, మిత్ర సహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన వుద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగము లున్నా మిత్రసహాయము కార్యసిద్ధి. విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదనవంటి శుభయోగములుకూడ వుంటవి. ★

# ★ పిచుకపాట ★

చిట్టి పిచికల మేము;
పొట్టి పిచికల మేము;
చిన్నారి పిచికలము;
పొన్నారి పిచికలము॥

ఒక్కటే గింజ నును
ముక్కుతో వొలిచికొని,
గ్రుక్కతో మా బుల్లి
రెక్కలను విప్పెదము॥

పసిడి తళుకులు, కెంపు
వన్నె బెళుకులు లేని
అచ్చ తెలిదుస్తు లే
అచ్చుకొన్నాము లే॥

సూర్య కిరణాలతో
సూటిగా నిదు లేవ
దూసుకొని వస్తాము
ఊసు పోకకు మేము॥

చలివాన కోర్వ ఇ
చ్చని తెల్ల ముకమాలు
చిన్ని యీకల కోటు
కన్నయ్యే తొడిగేడు॥

చిటికలో చక చకా
కిటికిటీలను దాటి
కిచకిచా లాడేటి
రుచి కలా పిచికలం.

మా చిన్ని పొట్టకేం,
సూచింపగా బోము;
మెలి చూరులను దా
గాల పుర్వులు చాలు॥

లే రెండ నీడ మా
కూయేలటు పీకారు;
చిరుత మువ్వల రవళి;
తురుతురో, తురుతురో॥

మాకు గాదులు లేవు;
మాకు సేరీ లేదు;
గడ్డి పరకల రాలు,
వడ్లగింజలు చాలు॥

అంతలో లేలు తాం;
ఇంతలో వాలుతాం;
కలక లలకలు లేని,
చలికార మొలుకుతాం॥

పాపాయి మాతోటి,
పాడుకొంటావా?
హాయిగా మాతోటి,
ఆడుకొంటావా?

★ సోమంచి సూర్యనారాయణ శర్మ ★

# నిజం మేష్టారు

[అది ఆ యింట్లో హాలు. హాలులో దూరంగా రెండుకుర్చీలు, పెద్ద బెంచీ వుంటాయి. ఎదుటి గోడకు క్యాలెండర్లు, పటాలు వ్రేలాడుతుంటాయి- శేషూ క్రింద కూర్చుని చదువుకొంటూవుంటాడు.]

శేషు : అశోకుడు బౌద్ధమతావలంబియై పెక్కు ధర్మకార్యములు చేసెను. బౌద్ధమతవ్యాప్తికి మిక్కిలి కృషి సల్పెను ప్రజల సౌకర్యార్థము, రస్తాల కిరువైపులా నీడకోసము చెట్లు నాటించెను. బావులు త్రవ్వించెను. చెరువులు త్రవ్వించి, రైతులకు 'తోడ్పడెను...ఇట్లు...... (సుశీల రావడం గమనిస్తాడు) పాటు బడుచుండగా, అంత సుశీల ఏతెంచెను...

సుశీ : ఏం చదువురా...వర్షంలో కూడ...

శేషు : వర్షం బైటగాని లోపల ఇంట్లో కాదుగా...

సుశీల : శేషూ! నాకేం తోచడం లేదురా! వంటింట్లోకి వెళ్తే అమ్మ...'ఇక్కడంతా బిల్లిం

ఇందలి పాత్రలు

1. సుశీల — చెల్లెలు
2. శేషు — అన్న
3. అమ్మ
4. మేష్టారు

బిల్లిం చేయకు పో...వెళ్లి ఆడుకో' అంది.

శేషు : ఈ వర్షంలో ఎక్కడికి వెళ్ళి ఆడుకుంటాం

సుశీల : అదే నేను చెప్పేదిన్నీ.

శేషు : ఏదైనా మనిద్దరమే ఆడుకోవాలి. ఈ నాలుగ్గోడల మధ్యనే ఆడుకోవాలి. వర్షంలో ఎక్కడికైనా వెళ్లామంటే అమ్మ తంతుంది.

సుశీల : అయితే ఏం చేద్దాం చెప్పు

శేషు : దాగుడు మూతలాడుదాం...

సుశీల : ఎలాగ? కళ్లు మూసేదెవరు? దాక్కునే దెవరు?

రాజేంద్ర

దొంగను పట్టే దెవరు? ఇద్దరమే వున్నామే. ఈ ఆట వద్దు శేషూ! ఎక్కువమంది వుంటేగాని ఈ ఆట బావుండదు. ఇంకేదన్నా చెప్పు.

శేషు : వానాగుంటలు ఆడదామా చెప్పు. నాదగ్గర చింత పిక్కలు రెడీగా వున్నాయి.

సుశీల : ఊహూఁ నే న్రాను. ఆ యాటలో ప్రతిసారీ నువ్వే గెల్చేస్తావు, నాకేం బావుండదు. అది ఎవరో ముసలివాళ్లు ఆడుకొనే ఆట:

శేషు : మరి...... ఇంకేం ఆట ఉందబ్బా!

సుశీ : నేను చెప్పనా...

శేషు : చెప్పు చెప్పు సుశీ మంచిది కాకపోతే చెవినులిమేస్తాను:

సుశీ : మరి మంచిదయితే...

శేషు : నువ్వు చెప్పినట్లల్లా చేస్తాను...సరేనా!...

సుశీ : సరే...

శేషు : చెప్పు మరి!

సుశీ : అదే. 'మేష్టారు - ప్రయివేటు బాలుడు' ఆట ఆడుదాం.

#  నిజం మేష్టారు 

చాల బావుంటుందిలే ఈ ఆట...! మొన్న సెలవుల్లో తాతయ్య వాళ్లూరులో రోజూ యిదే ఆట ఆడేవాళ్లం.

శేషు: ప్రయివేటు బాలుడు కాదే. 'ప్రయివేటు మేష్టారు-బాలుడు' ఆటకదూ! రైట్!... ఆడుదాం. నేను బాలుడు వేషం వేస్తాను. నాకదే యిష్టం. చక్కా మేష్టర్ని ఏడ్పించొచ్చు నువ్వు మేష్టారు వేషం వెయ్యి.

సుశీ: ఊహూఁ......నువ్వే మేష్టారు వేషం వేయాలి. నాకు బాలుడు వేషం చాల సరదాగా వుంటుంది శేషూ!

శేషు: ఊహూఁ...నాకొద్దు!

సుశీల: నేను చెప్పినట్టల్లా వింటానన్నావు గదూ మరి!

శేషు: సరే... నేనే మేష్టర్ని. నువ్వు బాలుడు - నీవని చెప్తాన్లే!

సుశీ: ఎలా...! నేను 'బాలుడు' వేషం వేసుకొస్తానుండు. నీచొక్కా లాగూ వేసుకొంటాను (లోపలికి వెళ్తూ వుంటుంది.)

శేషు: నేను మేష్టరు వేషం వేయాలికదూ......(మరో ప్రక్క లోపలికి వెళ్తాడు.)

(రెండు నిముషాల్లో చొక్కా, లాగు వేసుకొని, తలకు చిన్నటోపీ పెట్టుకొని 'లలలా......' అంటూ సుశీల వస్తుంది.)

సుశీ: ఎంచక్కగా వున్నానో! అచ్చు శేషూలాగే వున్నాను. ఆ అరే... శేషూ ఇంకా రాడే.

(శేషూ పంచెకట్టు, లాల్చీ, తలపాగాతో, చేతిలో గొడుగు పట్టుకొని...ఠీవిగా నడిచివస్తాడు: రాగానే కళ్లద్దాలు సవరించుకొంటాడు)

శేషు: అరే... నిజంగా ఎవరో అబ్బాయనుకొన్నా. నీ వేషం చాల బావుంది సుశీ!

సుశీ: నీ వేషంమటుకూ! అచ్చు మేష్టారులాగే వున్నావురా శేషూ!

శేషు: సరే...ఇకనుంచి నేను మేష్టార్ని, మరి నాకు కుర్చీ తీసుకురా...

సుశీల: వద్దు...చాప తెస్తానుండు.

(సుశీల వెళ్లి చాప తెచ్చి వస్తుంది. శేషూ చాపమీద ఒక ప్రక్కగా పద్మాసనం వేసుకుని కూర్చుంటాడు. సుశీల వెళ్లి పుస్తకాలు తెచ్చుకుని శేషుముందు కాస్త ప్రక్కగా కూర్చుంటుంది.)

శేషు: ఆఁ...అమ్మాయ్...... కాదు...అబ్బాయ్.

సుశీల: నా పేరు శేషూ, మేష్టారూ!

శేషు: రైట్......అబ్బాయ్ శేషూ...అలా కాదు...అమ్మలాగ శేషీ అంటాను. ఆఁ...శేషీ...... ఇవాళ్టి పాఠ మేమిటి...

సుశీల: 'బట్టతల మనిషి తాటిచెట్టు' పాఠం మేష్టారూ!

శేషు: గుడ్ 'ఒకానొక యూరియందు ఒక పెద్దమనిషి యుండెను.'

సుశీల: కాదు మేష్టారూ ఒక బట్టతల మనిషి, రాగిచెంబువంటి బట్టతల కలిగిన మనిషి వుండెను.

శేషు: ఇష్ ఊరికే అడ్డుదిడ్డు ప్రశ్న లేయకు.....నిజం మేష్టర్నయితే ఇలా అడుగుతావూ: అసలు...బట్టతల, పెద్దమనిషికి వుండకూడదేమిటి సర్లే! 'ఆ పెద్దమనిషి వ్యాపారము చేసెడివాడు. నిత్యమునూ...' కఠిన పదములు క్రింద రాసుకో మ్మా...కాదు అబ్బాయ్...నిత్యమునూ అనగా, ప్రతి దినమునూ అని రాసుకో. ఆఁ...'నిత్యమునూ వ్యాపార నిమిత్తము.' నిమిత్తము రాసుకో... కొఱకు...ఆఁ...'వ్యాపార నిమిత్తము పొరుగూర్లకు పోయెడివాడు,

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## బాలల సంఘం

GROUP
A లేక B

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జూలై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక సంరక్షకుని పూర్తి పేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీథి. నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, పారము : ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయుని పేరు (తెలిస్తే) :

ఆర్యా :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958] (సంతకము)

* వరా : ఏ పాఠశాలలోనూ గాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: 28-1-59 | ఈ దరఖాస్తు 31-1-59 నాటికి మాకు చేరాలి |

ఒక వేసంకాలమున, అట్లా పెద్ద మనిషి, వ్యాపారరీత్యా దూరమున నున్న నొకయూరికి బయలుదేరెను:'

(లోపలినుంచి అమ్మ కేక వేస్తుంది.)

అమ్మ : ఏయ్ శేషీ...

(ఇద్దరూ గప్ చిప్ మని పూరుకుంటారు)

అమ్మ : ఏయ్ సుశీ...ఏం చేస్తున్నారు మీరూ...

సుశీ : మేష్టారొచ్చారు. పాఠం చెప్తున్నారమ్మా!

అమ్మ : మరి శేషీ ఏడీ! ఏమయ్యాడూ...

(సుశీల బెదురుతో శేషూని చూస్తుంది.)

శేషు (చిన్నగా) మేష్టారు పంపారని చెప్పూ...

సుశీ : అవునమ్మా! మేష్టారు ఎక్కడికో పంపించారు.

అమ్మ : ఏమిటవును! మేష్టారా, ఈ వర్షంలో ఎక్కడికి పంపించారమ్మా... సరేలే... శేషూ వస్తే యిలా రమ్మను, వర్షం తగ్గగానే బజారుకు పంపించాలి.



దామెర్ల నరసింహదాసు
(వయస్సు: ఆరేళ్లు.)

అఖిలభారత నాట్యం పోటీలలో మొదటి బహుమతిపొందినబాలుడు. ఈ పోటీలు అలహాబాదులోని ప్రయాగ సంగీతసమితివారు ఈమధ్య ఏర్పాటుచేశారు

శేషు : చచ్చాం పో!

సుశీ : అలాగేమ్మా!......ఇక కానీండి మేష్టారూ...

శేషు : 'ఇట్లు ఆ పెద్దమనిషి... అనగా రాగిచెంబువంటి నిగ నిగ లాడునట్టి బట్టతల కలిగిన ఆ పెద్ద మనిషి...అట్లు నడవగా నడవగా మధ్యాహ్నమైనది. మంచి ఎర్రని యెండ చురుకుగా కాయుచున్నది. పాపమా...బాటసారి ఎండవేడిమికి అల్లాడిపోయినాడు. చుట్టూ చూసినాడు. ఎక్కడైననూ, విశ్రాంతి తీసుకొనవలెనన్న, నీడనిచ్చు చెట్టు యేదీ కానరాలేదు. అటులనే మరి కొంతదూరమేగునరికి ఒక తాటి చెట్టు అనగా తాళవృక్షము కని

## ★ నిజం మేష్టారు ★

పించినది. అంతటా పెద్దమనిషి పరమానంద భరితుడై దాని నీడ కరిగెను. ఆ నీడ అతనికి చాలలేదు. ఇంతలో వేడిగాలి వీచెను. ఆ గాలికి చెట్టుమీదినుంచి ఒక పెద్ద తాటికాయ రాలినది. అది ఆ బట్ట తల్ల మీద పడెను...'

సుశీ : నాకు అర్థంకాలా...

శేషూ : మొద్దూ సరీగా విను మరి. తాటికాయ, అసలే ఎండతో బాధపడుతున్న అతని బట్టతల మీద దభీమని పడిందన్నమాట!

సుశీ : బలే! బావుంది మేష్టారూ!

శేషు : ఇక లెక్కలు తీసుకొందాం - ఇరవై రెండూ ముప్ఫై మూడూ కలిపి నాలుగుతో హెచ్చించి, మూడుతో భాగిస్తే... ఎంతొ స్తుంది.

సుశీ : నాకు లెక్క రావురా! చరిత్ర చెప్పు.

శేషు : ఏయ్... నన్ను వొరే అంటావూ.

నేను మేష్టర్ని కదూ.

(లోపలినుంచి అమ్మ... సుశీ... అంటూవస్తుంది. వచ్చి ఇద్దర్నీ అలా చూసి ఆశ్చర్యంతో నిల్చుండి పోతుంది.)

అమ్మ : నమస్కారాలు మేష్టారూ. సుశీ లేదండీ...ఇక్కడ?

శేషు : (గంభీరంగా) లేదండీ ఇప్పుడే పంపించాను వస్తుంది లెండి.

అమ్మ : దాన్ని కొంచెం భయం పెట్టాలండి. ఇంట్లో నానా అల్లరి చేస్తోంది. నన్ను ఒక్కపని చేసుకో నివ్వడం లేదు. వీణ్ణి శేషూనికూడా కొంచెం భయం పెట్టండి. సరీగా చదువుకోవడం లేదు. మీరు ఏం చెప్పేసి పోతారో అంతే. మీ రెళ్లింతర్వాత పుస్తకమే తాకడంలేదు. రానురాను బాగా చెడిపోతున్నాడు. పాఠాలు సరీగా వొప్ప జెప్పకపోతే, వీపు వగల గొట్టేయండి ఫరవాలేదు. మీరు దండించకపోతే మరీ చెడిపోతాడు. చూడండి...కోతిలాగా టోపీ వేసుకున్నాడు...

శేషీ...ఆ టోపీ తీసేయ్...

(సుశీ మాట్లాడదు...ఇంతలో నిజం మేష్టారు ప్రవేశిస్తారు. శేషూ వేసిన వేషంలాగే వుంటుందాయన వేషం. రాగానే కళ్ళజోడు సవరించుకొంటారు. రాగానే...)

మేష్టారు : అబ్బాయ్ శేషూ... ('అమ్మ'ను చూసి)

నమస్కారాలండీ...(ముగ్గుర్నీ పరిశీలనగా చూస్తారు)

అమ్మ : (ముగ్గుర్నీ చూసి) ఇదేమిటి ఇంకో మేష్టరుగారొచ్చారు. (శేషూని చూసి) అచ్చు మీలాగే వున్నారు చూడండి మేష్టారూ...

మే : ఇదేమిటండీ...ఈ విడ్డూరం నాకు చెప్పా చెయ్యకుండ ...ఇంత హఠాత్తుగా ఇంకో మేష్టార్ని కుదిర్చుకొన్నారు. ఇదేం బావుండ లేదండీ! ఏమయ్యా స్వామీ! నేను చెపున్న ప్రయివేట్ ట్యూషన్ని...నువ్వెలా వొప్పుకుంటావయ్యా. బావుంది.

శేషు : నేను...నేను...(పైకి లేవబోతాడు. వణుకుతాడు...సుశీల 'లేవక'ని చేత్తో సంజ్ఞ చేస్తుంది. అలాగే కూర్చుంటాడు.)

మే : సరే లేవయ్యా : ముందు తాము ఇక్కడినుంచి దయచేసి బైటికి నడవడం...ఉభయత్రా మంచిది.

శేషు: (లేస్తాడు)మీకు ఇబ్బంది ఎందుకు! అమ్మగారూ నేను వెళ్తానండీ ... (రెండడుగులు బెదురుతూ నడుస్తాడు.)

అమ్మ : (సుశీలకేసి తిరిగి) ఏదీ ఆ టోపీ తీసేయ్ (తనే తీసేస్తుంది.)

అమ్మ : అయ్యో...నా చిట్టితల్లీ సుశీ! అచ్చు శేషూలాగే వున్నావమ్మా. ఈ డెస్సులో ఎంత ముద్దొస్తోందీ వేషం (సుశీ:ను! దగ్గరకు తీసుకుంటుంది.)

(మేష్టారు వెళ్లిపోతున్న శేషూ చెయిపట్టి లాగుతారు.)

మే : ఏయ్ ... ఇలారా...ఆ తలపాగా ... కళ్లజోడూ తీసి క్రింద పెట్టూ ... (శేషూ... తిరిగి,టక్ మని అలాగే చేసేస్తాడు.)

శేషు : నమస్కారం..... మేష్టారూ...

సుశీ : ఊరికే...వర్షంలో...ఏం తోచక...ఈ వేషాలేసి ఆడుకుంటున్నామంతే మేష్టారూ.

శే : అంతే మేష్టారూ...ఇంకేం లేదండీ...అమ్మా చూశావా... ఎంత బాగా చేశావో. ఎవరూ తెలుసుకోలేకపోయారు :

అమ్మ : ఆహా... ఎందుకు తెలుసుకోలేదూ. తెలిసే మేమూ నాటక మాడాము. అంతే! ఇక చాల్లే వేషాలు. వెళ్లి బట్టలు మార్చుకు రండి మీరు. కూర్చోండి మేష్టారూ (కుర్చీ తెచ్చి వేస్తుంది.)

(శేషూ లోపలికి వెళ్తాడు)

అమ్మ : సుశీ...నువ్వూ రా... మేష్టరుగారికి కాఫీ తెచ్చియిద్దువుగాని రా...తర్వాత ఇద్దరూ కూర్చుని చక్కా పాఠాలు చెప్పకోండి. (ఇద్దరూ వెళ్తుంటారు. మేష్టారు తృప్తిగా నవ్వుతారు. 'బలే పిల్లలు' అంటారు) (తెర) ★

# న్యాయ నిర్ణయము

ఒకప్పుడు వర్తకులు కొందరు ఎడారి మీదుగా ప్రయాణం చేస్తున్నారు. బాగా అలిసిపోవటంచేత మజిలీ ఏర్పాటు చేసుకుందామని కొంచెం చెట్టు చేమ వున్నచోట ప్రయాణం ఆపారు. అవసరమయిన సామానుమట్టుకు దింపి వంటప్రయత్నాలలో పడ్డారు.

ఆకలి బాగా వేస్తుండటం, బడలిక ఎక్కువ అవడంవల్ల ఆహడావుడిలో ఒంటెల విషయం గూడ పట్టించుకోలేదు వాళ్ళు. తీరా కడుపులు చల్లబడ్డాక తిరిగి చూసి తెల్లబోయారు. వీరికి వున్న ఒంటెలలో ఒకటి కనబడలేదు. కంగారుగా నలుగురు నాలుగువైపుల వెదికారు. కాని లాభం లేకపోయింది. కనుచూపు దూరంలో ఎక్కడా ఒంటె జాడయినా కనబడలేదు వారికి.

అంతలోన బాగా చీకటిపడింది. ఇక వెదికినా లాభం వుండదని నిరుత్సాహపడి నాలుగు చితుకులు పోగేసి మంటచేసి చుట్టూ చలికేల పడ్డారు. పోయిన ఒంటెను ఎలా సంపాదించడం? అని పరి పరి విధాలా ఆలోచించారు.

"అంతా అలా కూర్చున్నారు. ఏమన్నా పోయిందా?" అన్న మాటలు వినిపించాయి.

ఒక్కసారి వెనక్కు తిరిగిచూశారంతా.

తెల్ల తెల్ల బట్టలు కట్టుకున్న ఒక పొడుగాటి మనిషి నిలబడి వున్నాడు వారికెదురుగా.

"ఏమన్నా పోయిందా? అలా వున్నారు!" అన్నాడు మళ్ళీ.

"అవునండీ! అందుకే యిలా దిగాలు పడిపోయాం...కూర్చోండి," అంటూ జరిగి కూర్చున్నారు.

వచ్చినాయన కూర్చొని అరచేతులు మంటవైపు పెట్టి "మీ ఒంటె పోయింది కదూ" అన్నాడు నిప్పులోకి చూస్తూ.

కె. యస్. గిరీశ్వరరావు

అంతా ఒక్కసారి ఆశ్చర్యపోయి "ఔనండీ" అన్నారు. పోయిన ఒంటె సంగతి అతగాడికి తెలుసునను కొని.

"అది గుడ్డిది కదూ. దాని ఎడమకాలు సన్నంగూడా! అవునా! అడిగాడు తను.

"అవునండి." సంతోషమును వెలిబుచ్చుతూ పలికారు ఆ వర్తకులు.

"దానికి ముందు పళ్లలో ఒకటి పోయింది గూడ!"

"సరిగ్గా చెప్పారు." ఒంటె దొరికినంత సంతోషం వచ్చింది వాళ్ళకి.

"అది ఒక ప్రక్క ధాన్యము, మరొక ప్రక్క తేనె మోస్తోంది. అవునా?"

"అరె. మీరు చెప్పిందంతా నిజమేనే," మీకు కనబడిందా? ఆ ఒంటె," అడిగారు ఆశగా.

"నేను ఆ ఒంటెను చూడనే లేదు," అన్నాడు నిర్లిప్తంగా.

అంతా ఒకసారి తెల్లబోయారు. అతని మాటలు నమ్మబుద్ధి కాలేదు వాళ్లకు. ఒంటెను దొంగిలించి అబద్ధాలాడుతున్నాడని వారి వుద్దేశ్యం. కాని ఎన్నిసార్లడిగినా ఆమాటే చెప్పాడతడు.

చేసేదిలేక ఆ వర్తకులు అతనిని ఒక న్యాయాధిపతి వద్దకు తీసుకొని వెళ్ళారు. జరిగిన విషయాన్ని సవిస్తరంగా చెప్పారు.

"మా ఒంటెనుగురించి అతను చెప్పిన విషయాలన్ని సరిగ్గా వున్నాయండీ. తీరా దాన్నినువ్వుచూశావా అంటే లేదంటాడు. మా ఉద్దేశ్యం ఆ ఒంటెను యితనే దొంగలించయినా వుండాలి, లేకపోతే దానిని పట్టుకుపోయిన వారి జాడ యితనికి తెలిసయినా వుండాలి. కాబట్టి తమరీ విషయాన్ని విచారించి మాకు న్యాయం చేకూర్చమని ప్రార్థిస్తున్నాం" అన్నారా వర్తకులు.

నిజానికి న్యాయాధిపతికి గూడ యిది చాలా చిత్రంగా కనబడింది. ఒంటెను చూడకుండా దాన్ని గురించి వివరాలు ఎలా చెప్పాడో అర్థంకాలే దాయనకు.

"ఇది చాలా తమాషాగావుందే. అసలు విషయమేమి"టని అడిగాడు న్యాయాధిపతి.

"అసలు నేను ఆ ఒంటెను చూడనే లేదండి," అన్నాడతడు.

# ★ న్యాయ నిర్ణయము ★

"మరి వాళ్ళ ఒంటె పోయిందని ఎలా చెప్పగలిగావ్ ?"

"దారిపొడుగునా నాకు ఒంటె అడుగులు కనబడ్డాయి. అందుచేత వారు ఒంటెను పోగొట్టుకొన్నారని చెప్పాను."

"అయితే దాని కుడికన్ను గ్రుడ్డిదని, ఎడమకాలు సన్నమని ఎలా చెప్పావ్" అని అడిగాడాయన.

అతను నన్నగా నవ్వాడు.

"నేను ముఖ్యముగా రెండు విషయాలు గమనించగల్గాను. అది ఎడమప్రక్క గడ్డి తింది. దాని ఎడమకాలి పాదముద్ర మిగతా పాదములకంటె తేలిగ్గా పడింది. అందుచే దాని కుడికన్ను గ్రుడ్డిదని, ఎడమకాలు సన్నమయి వుంటుందనుకొన్నాను;" జవాబిచ్చాడతను.

"సెబాష్...... దాని ముందు పళ్ళలో ఒకటి వూడిందని చెప్పావు గదా! అదెలా ?" ప్రశ్నించాడాయన.

"అది గడ్డికొరుకునపుడు మధ్యలో కొద్దిమేర మాత్రం తెగకుండా ఆ ప్రదేశంలో వుండిపోయింది. అందుచేత దానిముందు పళ్ళలో ఒకటి వూడిందని తెలుసుకొన్నా"నని చెప్పాడతను.

"అన్నీ బాగానేవున్నాయి. కాని అది మోస్తున్నది 'ఫలానా' అని ఎలాచెప్పావ్" అన్నాడు ఆఖరి ప్రశ్నగా:

ఏంచెపుతాడా అని అందరూ అతనివంక చూశారు. "అదేముంది. చాలా చిన్నవిషయం. దారిపొడుగునా ఒకప్రక్క చీమలబారు, మరొకవైపు తేనెటీగలు కనబడ్డాయి. దానివల్ల అది ఒకప్రక్క ధాన్యము మరొకప్రక్క తేనె మోస్తోందని చెప్పటంలో విచిత్రంలేదు."

ఆ సమాధానంతోటి న్యాయాధికారి పూర్తిగా తృప్తిపడ్డాడు. అతను నిర్దోషి, అన్న నమ్మకం ఆయనకు ఏర్పడి వెంటనే అతన్ని వదిలేశాడు.

వర్తకులకు హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది: "ఇన్ని చెప్పినతను ఒంటె ఏమయిందో చెప్పలేకపోతాడా ? అని. ఆ విషయమే న్యాయాధికారికి చెప్పారు.

ఆయనకుగూడా ఆ ఆలోచన వచ్చింది. వెంటనే అతన్ని పిలిచాడు. "నువ్వొకసాయం చేయాలోయ్ వాళ్ళకు—ఒంటెను ఎవరన్నా ఎత్తుకుపోయారో లేకపోతే దానంతటదే తప్పించుకు పోయిందో చెప్పావంటే—అంటూ ఆపేశారు.

అతను ఒక్కక్షణం ఆలోచించాడు:

"దాన్ని ఎవరూ ఎత్తుకుపోలేదని గట్టిగా చెప్పగలను." అన్నాడు.

"ఎలా ?"

"నాకు కనపడినవి కేవలం ఒంటె అడుగులు. దానిని ఎవరైనా ఎత్తుకుపోయివుంటే ఆ అడుగుల పక్కన మనుష్యుల అడుగులు గూడ కనబడేవి. అటువంటి వేమీ లేవు కాబట్టి దానంతటదే వెళ్లిపోయిందని నా నమ్మకం," అన్నాడు.

వర్తకుల ముఖాలు విప్పారాయి, న్యాయాధిపతికి, అతనికి కృతజ్ఞత తెలిపి ఒంటెను వెతుక్కునేందుకు వెళ్లిపోయారు. ★

# ★ మాలతి పెళ్ళి ★

(23-వ పేజీ తరువాయి)

మనం అనుకున్న మాటలు నీకు గుర్తున్నాయిగా!...మాలతీ! మనలో ఎవరి పెళ్ళి ఎప్పుడయినా మిగతా వాళ్ళు యిద్దరు యెక్కడున్నా యెలా ఉన్నా హాజరయితీరాలి," అని అన్నావు. జ్ఞాపకముందా?... సరోజ యెక్కడో ఉంది, అంతా ఖర్మ!...దాని బ్రతుకు అలా బ్రద్దలయిపోయింది...... వ్రాయాలంటే యిలా చాలా ఉంటాయి. మనసు విచ్చే మనుష్యులతో మనసు విప్పి మాటాడితేనే మహదానందంగా ఉంటుంది. కాని కలం కలిగే ఆ మాటల్ని ప్రాణంలేని వ్రాతల్లో వ్రాస్తే వాని విలువ నశించిపోతుంది. అందుకని నీవు పెళ్ళికి ఒకరోజు ముందే బయలుదేరివస్తావని ఆశిస్తున్నాను... పిల్లలందర్నీ తీసుకొనిరా! మీవారిని కూడ బయలుదేరదిస్తావుకదూ! –నీకోసం చూస్తూ ఉంటాను...సెలవు

— నీ మాలతి."

ఉత్తరం చదివి మడిచి కవర్లో పెట్టాను... ఇంతలో డ్రస్ మార్చుకుని వచ్చిన ఆయనగారు 'ఉత్తరం యెక్కడినుంచే?' అన్నారు.

'మా మాలతి వ్రాసిందండీ!...' అన్నాను అత్యంతానందంతో !–

"ఏం వ్రాసింది?...పెళ్ళికిముందే బయల్దేరి రమ్మని వ్రాసిందా?" అంటూ అన్నీ తానే ఆయన గ్రహించేసినట్టు అన్నారు.

"మరేనండి పాపం, రమ్మని మరీ మరీ వ్రాసింది!..." అన్నాను.

'అయితే ఇంకేం! బయల్దేరు. తప్పేముందా మరి?" అంటూ ఆయన తన అంగీకారాన్ని తెలియజేశారు.

అమ్మయ్య! ఆయనగారి అంగీకారం వచ్చేసింది. ఇక మనం బయలేరివెళ్ళడమే! అత్తామామలుండా ఆయన్నికూడ మరీమరీ రమ్మని వ్రాసింది.

'ఏమండీ!...అన్నట్టు మిమ్మల్ని కూడా రమ్మని మరీమరీ వ్రాసిందే' అన్నాను గబగబ!

'ఆ!...నాక్కూడ రాసింది మరీమరీ!..' అన్నారాయన నవ్వుతూ.

'సెలవుపెట్టి మీరుకూడ రండీ! పాపం!" అన్నాను.

"ఆ, చూద్దాంలే. పిల్లల్ని తీసుకొని నువ్వెళ్ళు" అన్నారు.

ఇంతలో పెద్దాడు స్కూలునుంచి రావడంతో వాడికి టిఫిను పెట్టటానికి వెళ్ళాల్సొచ్చింది. తెల్లారి పొద్దున్నే ప్రయాణం పెట్టుకున్నాను. రాత్రంతా బట్టలు సర్దుకున్నాను. దానికేం ఒహాయిరి ఇవ్వాలాని ఆలోచించాను. దానికి నీలం జారెటు చీర అంటే మాచెడ్డ ఇష్టమని వెనక ఓ సందర్భంలో చెప్పింది. వెంటనే గుర్తొచ్చి పెద్దాణ్ణి బజారు పంపించి బట్టలకొట్లో వెదకాయించి ఆచీర, జాకెట్టుగుడ్డ తెప్పించాను. అన్నీ సిద్ధంచేసి పడుకున్నాను. అయిదింటికే అలారం పెట్టి పడుకున్నాను. ఏడింటికే రైలు. అలారం విని లేచి పిల్లల్ని లేపి ఒక్కొక్కళ్ళకే మొహాలు కడిగిస్తున్నాను.

"అమ్మా!...... ఈ జాకెట్టు తొడుక్కోనా!" అంటూ బుజ్జిగాడకు రాబోయింది ... ఏంచెప్పమంటారు!... అంతా విశ్వామిత్రకని.

"......రాదు!......రాదు! దూరంగా ఉండు!..." అంటూ దాన్ని కసిరాను...

ఇంతలో ఆయనగారు లేచారు.

"అదేమిటే! ... యింకా అలా కూచున్నావేం? ... టైము కావటంలేదూ!......" అంటూ అడిగారు...అనుకున్నంతా అయింది!...వారు వట్టి అమాయకులు!

"ఏంలేదు కానీండి!...ముందు మీరు కాలకృత్యాలు తీర్చుకోండి! మీకేం బయల్దేరి వెడుదురుగాని," అన్నాను...

"ఓహో!...అదా సంగతి!...అర్థమయింది!..." అంటూ ఆయన గబగబా మొహం కడుక్కున్నారు.

ఈలోగా పెద్దాడిచేత బట్టలు సర్దించి సంచిలో కొత్తచీర, రవికెలగుడ్డ పెట్టించి ఆయన్నికూడా బుజ్జని పంపించాను. మనం ఒకపని చెయ్యాలని ఎంతగా ఆరాటపడతామో అంతగానే నిరాశ చెందుతాము ఒక్కొక్కప్పుడు!...మా యిద్దరి పెళ్ళిళ్ళు చేయించిన—అదే దగ్గరుండి జరిపించిన దాని పెళ్ళికి—మా మాలతి పెళ్ళికి నేను వెళ్ళలేకపోయాననే దాని నేను విచారించసాగాను. పోనీ సరోజేనా వెడుతుందా అంటే...అదెలా వెడుతుంది!...దాని ఖర్మ అలా కాలిపోతే. దాని అదృష్టం అంతే, అనుకున్నాను.

రెండురోజుల తర్వాత ఆయనగారు తిరిగి వచ్చారు. నేను రానందుకు మాలతి యెంతగానో యేడ్చిందిట. పెళ్ళికొడుకు యేమంత బాగుండడుట...అందులోనూ రెండో పెళ్ళిట...ఏమిటేమిటో మావారు పెద్ద విశేషాలు చెప్తుంటే నా తల తిరిగిపోయింది.. దాని జన్మకాల నక్షత్ర ప్రభావం అంతేనేమో అనుకుని ఒక్క నిట్టూర్పు విడిచాను.

★



# వనితాలోకం

## ★ ఒక్కగానొక్క పిల్ల ★

"అనగనగా ఒక రాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. ఒక్క కూతురు. ఆ కూతుర్ని ఎంతో గారాబంగా పెంచారు" అని చెప్తున్నాడు నా మేనల్లుడు మురళి, వాడి చెల్లి ఉషతో.

"మరి కొడుకుల్ని గారాబంగా పెంచలేదా అన్నయ్యా" అని ధర్మ సందేహాన్ని వెలిబుచ్చింది ఉష.

"ఏమోమరి" అన్నాడు మురళి.

"ఒక్కతే కూతురంటే మరి గారాబమే కదూ" అన్నాను నేను.

ఇంతలోకి వదిన అటు వెళ్తున్నదల్లా ఆగి "ఒక్క కూతురైతే నేమి ఏమిటి గారాబం? మీరు నలుగురున్నా మిమ్మల్ని గారాబం చేయలేదటే మీ నాన్నగారూ వాళ్ళు?" అంది.

"అలా కాదు వదినా. ఒక్క కూతురు తన కానే చాలా లాభాలున్నాయి. నీకు తెలీదులే" అన్నాను నేను.

"నష్టాలమాట చెప్పావు కాదేం" అంటూ వచ్చాడు మా అన్నయ్య. నిజమే నష్టాలు కూడా చాలానే వున్నాయి.

ఆడపిల్లల్ని పెంచి పెద్దవారిని చేసి అత్తవారింట్లో మెప్పు సంపాదించుకో నేటట్లు చేయడం ఒక పెద్ద ఘనకార్యం ... నేర్పవలసి వుంటుంది తల్లిదండ్రులు చేస్తున్నారో. ఇక గారాబం సంగతి ఎత్తితే "ఒక్క పిల్లకు" జరిగినంత గారాబం ఇంకెవ్వరికీ జరగదు.

ఇంతెందుకు మా ఉషనే తీసుకోండి. అది మా అన్నయ్యకి ఒక్క కూతురు. మురళి వున్నాడనుకోండి, కొడుకు. కాని అది చిన్నది. ఉష మురళి తరువాత అయిదేండ్లకు పుట్టింది. దానికిప్పుడు ఎనిమిదేళ్ళు. ఇంత వరకు అది ఆడింది ఆట, పాడింది పాట. ఇప్పుడు చిన్నపిల్ల కాబట్టి బాగానే వుంది. కాని తరువాతో?

"ఏం వదినా! నీ ముద్దుల కూతుర్ని ఒక్క

ఎమ్. హేమలత
(లింగసముద్రం)

రోజు కూడ విడిచి వుండలేనంటున్నావే? మరి రేపు దానికి పెండ్లయాక అత్తారింటికి పోతే ఏంచేస్తావేం" అన్నాను నేను మా వదినతో ఓరోజు మాటల సందర్భంలో.

"అమ్మో! ఉషను అత్తారింటికి పంపించనమ్మా! అల్లుడిని ఇల్లరికం తెచ్చుకుంటాను" అని నవ్వేసింది.

కాని ఇల్లరికపు అల్లుడిని తెచ్చుకోవడం సులభమైన మాటా ఏమిటి? అసలు ఈ కాలపు ఆడపిల్లలే చాలామంది తమభర్తలు ఇల్లరికపుటల్లుళ్ళుగ వుండటానికి ఒప్పుకోరు. ఇలరికపుటల్లుడిని ఎంత గౌరవంగచూచినా ఏదో వెలితి కనిపిస్తూనే వుంటుంది. అరె... ఒక్కమ్మాయి గారాబం సంగతి చెప్తూ ఈ విషయానికి వచ్చానే!...

ఆ...! ఆ గారాబంచేయటంకూడ ఏకైక పుత్రికవిషయంలో చాలా గమ్మత్తుగ జరిగి పోతూ వుంటుంది. నలుగురైదుగురు కూతుళ్ళున్న తండ్రి తన కూతురి మూడవ పుట్టిన రోజున ఆ అమ్మాయిని వెల్వెట్లతో నింపి చేయలేదుకదా! అదే 'ఒక్క అమ్మాయి' అయితే ఒక్కతేకదా ఏం నలుగురికి చేస్తున్నామా అన్న ధోరణిలోకి వచ్చేస్తుంది. మా ఉషకి అయిదవఏడు వచ్చినపుడు మా వదిన దానికి టిష్యూపావడ, చమ్కీ పెట్టి కుట్టిన వెల్వెటు బ్లౌజు, కుట్టేకాని వీలు కాదంది. అప్పటికే దాని పెట్టెనిండా ఖరీదైన పావడాలు బోలెడున్నాయి.

ఇంక ఒకటి రెండేండ్లు పోతే పెరిగి పెద్దదవుతుంది. ఇక ఆ పావడాలన్నీ దండుగే! తరువాత పిల్లలుంటేగా మళ్ళీ వాడటానికి. "అన్ని పావడాలున్నాయి కదా మళ్ళీ దానికి అంత ఖరీదైన పావడా ఎందుకు" అని అన్నయ్య అంటే, నేనే కలుగచేసికొని "అదేంటన్నయ్యా? నీకేం వదినుందా, వస్తుందా? ఓ నలుగురికి నాలు పావడాలు నాలుగు కుట్టించినంత అవుతుందా?" అని వదిన్ని వెనకేసుకొచ్చాను. ఆ సమయంలో అలా అనడమే సబబుగా వుంటుంది మరి.

మనం ఎలా అనుకున్నా ఉష పట్టుపావడాలతో, ఎనలేని భంక్షనతో, అంతులేని గారాబంతో పెరిగి పెద్దదవుతుంది. మా ఉష మాటే ఏమిటి! ఏకైక పుత్రిక ఎవరైనా అంతే! ఆమె కాన్వెంటు చదువు, డాన్సు, ("ఒక్కమ్మాయి కదా ఆ మాత్రం చెప్పించలేమా" అని మధ్య తరగతి కుటుంబీకులు కూడ చెప్పిస్తారు) షోకులు, శిగారాలు, అన్నిటికన్న ముఖ్యంగ మొండితనంలో, సుకుమారంగా, పెరిగి పెరిగి పెద్ద దవుతుంది.

మొండితనం ఎందుకంటారేమో! ఆమె మాటకు ఇంట్లో ఎదురులేదు. ఏది కావాలన్నా అది వస్తూ వుండె. తనొక రాజకుమారిని అనుకొని పెరుగుతుంది. పెరగటం వరకు బాగానే వుంది. కాని ఇక ఆ అమ్మాయి పెండ్లి విషయంలో ఆ తల్లిదండ్రులు ఎదుర్కొనే బాధలు అన్నీ యిన్నీ కాదు.

మా అమ్మాయి ఒక్కతే కాబట్టి పెండ్లి ఘనంగ చేయాలి. కనీసం పద్మని, రాగిణి డాన్సు అయినా పెట్టకపోతే ఎలాగ అని తల్లి అనుకుంటుంది. ఇలా అందరు తల్లులూ అనుకుంటారని కాదు. వారి వారి హోదాకి తగ్గట్టు అనుకుంటారని. ఇక తండ్రి "నాకున్నది ఒక్క కూతురు ఎంత తక్కువైనా, హీనపక్షం ఇంజనీయరయినా కాకుంటే ఎలాగబ్బా" అని అనుకుంటాడు. ఇంతకీ అమ్మాయి ఏమనుకుంటుందనుకున్నారు. బాగా గారాబంగ పెరిగింది. కాన్వెంటులో చదువుతో Fashionable Circle లో తిరిగి వుంటుందేమో ఆమె ఆలోచనలు అభిరుచులు చాలా పైస్థాయిలో వుంటాయి. భర్త అనగానే ఆమె మనసులో ఒక సుందరాంగుడు చిన్న సైజు కారు, అందమైన బంగళా; ఇలా వుంటాయి. ఊహాలు. ఇవన్నీ సమకూర్చేసరికి తండ్రి తల బట్టకట్టి పూరుకుంటుంది. కాదు, కూడదు అని బెదిరించి, అదిలించి ఎవరికో ఒకరికి 'ఒక్కపిల్ల' తల్లితండ్రులు తమ పిల్లను ఇవ్వలేరు. అలా ఇద్దామనుకున్నా ఆ అమ్మాయి ససేమిరా ఒప్పుకోదు. చిన్నతనంలో తను ఐస్‌క్రీమ్‌కోసరం ఎలా మొండిపట్టుపట్టి సాధించుకుందో అలాగేనని అనుకుంటుంది. శరీరం పెరిగి పరిపక్వం చెందిన మనస్సు మాత్రం ఇంకా బాల్యాన్ని విడి వుండదు.

పోనీ ఎలాగో కష్టపడి ఒక మంచి వరుడినే తీసుకొస్తారనే అనుకుందాం. ఇక ఆ అమ్మాయి అత్తగారింటికి వెళ్ళేటప్పటికి తాతలు దిగిరాక మానరు. మొట్టమొదట తల్లి విడిచిపెట్టి వుండలేదు. పెడబొబ్బలతో, రాగాలతో అమ్మాయిని ఖంగారు పెట్టేస్తుంది. అప్పటికే అమ్మాయి ఎలాగో మనస్సును దక్కబెట్టుకొని అత్తగారింట్లో అడుగుపెట్టినా. పరాయి స్థలంలో ఏమంత లోటు జరిగినా. అమ్మ జ్ఞాపకానికి వస్తుంది అందులో ఈ అమ్మ వారానికి రెండు, మూడు ఉత్తరాలయినా వ్రాస్తూ వుంటుంది ముద్దుల కూతురి కోసరం తను బెంగపెట్టుకొన్న వైనాన్ని ఓ ఇరవై రోజులుండడం అమ్మను చూడాలని వుందని పుట్టింటికి రావడం మళ్ళీ అటు భర్త పోరు పడలేక అత్తగారింటికి వెళ్ళడం, ఇలా ఆ అమ్మాయి కాపురం తయారవుతుంది. ఎప్పుడూ పుట్టింటికి మొహం వాచివుండే భార్యతో ఏ భర్త సుఖపడగలడు చెప్పండి. ఈ విషయంలా ఇక ఇద్దరికీ ఇతర విషయాలపై అభిప్రాయ భేదాలు, మనస్పర్థలు బోలెడు గొడవలు బయలేరాయి.

నాకు బాగా గుర్తు. మా స్నేహితురాలి పెండ్లివిషయంలో ఇలాగే జరిగింది. 'ఆమె' శ్రీమంతుల ఏకైక పుత్రిక. అందాల భరిణె, సుగుణాలరాశి. విద్యావతి. పెండ్లికొడుకు వాళ్ళ అంతస్తుకి తగినవాడే దొరికాడు. చక్కగా వున్నాడు. ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు. ఇరుపక్షాలవాళ్ళు ఇష్టపడి లగ్నాలు పెట్టుకుందామనే సమయానికి పెండ్లికొడుకు 'నే నిప్పుడే వివాహం చేసుకోనని' తన అయిష్టతను తెలియచేశాడు. వాకబు చేయగా తెలిసిన సారాంశం. వాళ్ళ అన్నయ్య ఒక 'గారాబుపట్టి'ని చేసుకొని అనుభవిస్తున్నాడట. తనుకూడ మళ్ళీ ఆ తప్పు నే చేయదలచుకో లేదట!



డోలికాఖేలనము

చిత్రకారుడు :—కార్యంపూడి కృష్ణమూర్తి (పేరాల)

పుట్టింటికి వెళ్ళావని పోరుపెట్టడమే కాదు ఈ ఏకైక పుత్రిక విషయంలో ఇంకా కొన్ని అవకతవకలు కూడ ఆమెకు తెలియకుండానే ఆమెలో పెరిగిపోయి వుంటాయి నలుగురిలో పెరగని అమ్మాయి కాబట్టి నలుగురితో కలిసిమెలిసి వుండడం కష్టసుఖాలను వెన్వెంటనే యితరులకు పంచియివ్వడం తెలిసి వుండదు. అత్తారింటికి వెళ్ళిన ఏ క్రొత్త కోడలికయినా ఎన్నో కష్టాలు ఎదుర్కొంటాయి అందులో ఈ 'ఒక్కమ్మాయికి' ఈ కష్టాల నెదుర్కొంటే శక్తి చాలా తక్కువగ వుంటుంది. పుట్టింటో తాను ఒక్కపూట అన్నము తినకపోతే తల్లితండ్రి హడలిపోయి నానా హంగామా చేస్తారు. అక్కడ అది ప్రపంచసంఘటన కాని ఇక్కడో, అదేమీ పెదవిషయం కానట్టు భర్తే సంచరిస్తాడు. ఇక ఈ అమ్మాయి అభిమానం దెబ్బతింటుంది. ఇలాంటివే ఎన్నో సంఘటనలను (దుస్సంఘటన లందామా?) ఎదుర్కొని ఆ అమ్మాయి ఒక నిశ్చయానికి వస్తుంది. తన నేదో శిక్షిం దరూ కలిసి కోడరికం పెడుతున్నారని ఇక ఆ అమ్మాయి తన జీవితాన్నే కాక తన జీవితంతో పెనవేసికొనే ఇతర జీవితాలకి కూడ రంపపుకోత పెడుతుంది. సుఖంలేని జీవితమై కూచుంటుంది ఆమె బ్రతుకు. భయంకరమైన చిత్రం చూపించడం నా ఉద్దేశం కాదు. హెచ్చరిక చెయ్యడమే. నేను చెప్పొచ్చే దేమిటంటే అసలు ఆడపిల్లల పెంపకవిషయంలోనే తల్లితండ్రులు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవలసి వుంటుంది. ఆ బాధ్యతకన్న పదింతలు బాధ్యత 'ఒక్కగానొక్క కూతురు' గల తల్లితండ్రులు తీసికోవలసి వుంటుందేమో నని అదే నేను మా వదినకి చెబుతూంటాను. మరి మా వదినలాటి తల్లులు ఇంకెందరున్నారు?



# వాల్తేరులో వస్తు ప్రదర్శనం



మొన్న డిసెంబరు నెలలో వాల్తేరులో జరిగిన 'ఆంధ్రా యూనివర్శిటి,' వారి విజ్ఞాన శాస్త్ర ప్రదర్శనం (Arts & Science, Exhibition,) చాలా బావుంది. విద్యార్థినుల దగ్గరనుంచి, పాశ్చాత్య విద్యాజ్ఞానంగల, అన్ని తరగతుల వారిని, ఈ ప్రదర్శనం చాలా ఆకర్షించింది. సృష్టి మొదలైన దగ్గరనుంచి, నేటివరకు, మానవులలో, జంతువులలో, కలిగిన పరిణామాలగురించి, వివిధరకాల ఖనిజాలు, వాటి ఉపయోగాలు, వివిధయంత్రపరికరాలు, అన్నీ 30 శాఖలుగా అమర్చారు. బయాలజీ, సైన్సు, ఫిజిక్సు, మేథమెటిక్సు, కెమిస్ట్రీ, జియోఫిజిక్సు, లా, తెలుగు, సంస్కృత విభాగాలు వున్నాయి. జంతువులు, పక్షులు, మానవులు ఇవి తల్లిగర్భంలో వున్నప్పుడు 2, 3, నెలల దగ్గరనుంచి క్రమంగా, పరిణామం చెందేవిధం, గాజు సీసాలలో వుంచినవి వివిధ దశలలో చూపించారు. ప్రకృతి శాస్త్రపరిజ్ఞానం, మనకు కలగాలంటె ఇలాటి ప్రదర్శనలలోనే, అన్ని

## అడవికొలను పార్వతి

(విశాఖపట్నం)

వివరాలు లభ్యమవుతాయి. మామూలుగా ఏ మెడికలు స్టూడెంట్లకో తప్ప, గృహస్థులకు, ముఖ్యంగా ఆడవాళ్ళకి, ఇవి ఏమి తెలియవు.

ఇంకా ఇందులో, రోగకారకాలు, క్షయ కలిగించే క్రిములు, పేగులలో వుండే, ఏలిక పాములు సీసాలలోవుంచి చూపించారు. ఇంకా ఇక్కడ, మనిషి ఉష్ణాన్ని, కొలిచే యంత్రాలు, చర్మంలోపల చొచ్చుకుపోయి ఆ భాగాలను, కనుపింపచేసే, పరికరాలు వున్నాయి. భూమి, మొదట ఏర్పడినప్పుడు వుండే విధానాన్ని, బొమ్మలగీసి, లైటు పెట్టి అమర్చారు. ఎదురుగా సూర్యుడు, చుట్టూ కొండలు, భూమివుంది. అసలు ప్రాణి ఏర్పడానికి ముందు మైక్రోస్కోపులో గాని కంటికి కనిపించని, చిన్న చిన్న సూక్ష్మజీవులు వుండాలిట. ఆ తరువాత, క్రమంగా పరిణామం చెందుతూ చేపలు, బల్లినిపోలిన జంతువులు మొసలి, ఏనుగు పాములవంటి జంతువులు వచ్చాయి. ఆఖరిని స్తన్యం ఇచ్చి, కనిపెంచే జంతువులు, తరువాత వానరాలు. ఈ వానరాలు 3 రకాలుగా విభజించారు. మొదటిది మెడ కొంచెం అడ్డంగా (జంతువులకువున్నట్టు)వుండి, బాగా కోతి రూపునవున్నది, 2వ దాంట్లో, కొంచెంమార్పు, మెడకొస్త నిలువుకివుండి కొంచెం మొహంలో మార్పు, 3వది పూర్తిగా మనలా, మెడబాగా నిలువుగా వుండి మొహం అదీస్పష్టంగా,ఏర్పడ్డ మనిషి. ఇదంతా చూస్తూవుంటె, ఎంతో పరిణామం, ఎన్నికోట్ల ఏళ్ళో జరిగిన ఫలితంగా చివరకు, మారిమారి, ఆఖరికి మానవుడు పుట్టాడు, మానవజన్మ ఎంత ఉత్కృష్టమైనది అని, అనిపించకమానదు అలాగే ఇప్పుడువున్న ఏనుగు, మొసలి, పాములు, బల్లులు, వాటిమూల జంతువులకును వీటికి ఏదో కొద్దిగా తప్ప పోలికలే లేవు అవి చాలా బరువు. క్రమంగా వాతావరణంలోని మార్పుల కనుకూలంగా మారుతూ మనం, ఇప్పుడు చూసున్న జంతువుల్రింద మారాయట. అలాగే చెట్లు, చేమలూ కూడాను. 600 మిలియన సంవత్సరాల క్రితం వున్న వాటి వివరాలను, ఈనాడు శాస్త్రజ్ఞులు, వాటి ముద్రల మూలంగా, వివరాలు కనుక్కొంటున్నారు అప్పటి వృక్షాలన్నీ కాలక్రమేణ, భూగర్భంలో, రాతిబొగ్గు క్రింద, మారడంతో వాటిపైన, కొన్ని కొమ్మల గుర్తులు, జంతువుల ముద్రలు, స్పష్టంగ కన్పిస్తాయి.

ఖనిజాలలో, అన్ని రకాలూ వున్నవి. మెంగనీసుని, 2, 3 రకాలు కలిపితే తయారయే సింగాణీరాళ్ళు, సిమెంటు, స్టీలు, వజ్రపురాళ్ళు, యాటంబాంబులకు, పనికివచ్చే వస్తువులున్న, పెద్ద రాయి చూపించారు. ఈ రాయి దాని పళంగా భూమిలో దొరికిందిట. రకరకాలమట్టి, రాళ్ళు, ఇసుక

గాజు పీపాలలో భద్రపరిచారు. భూమిపైన వుండే మట్టి, నదులలో వుండేది, కొండలలో, అడుగువెళ్ళ కొద్ది వుండేది అలాగే ఇసుక, పైది, సముద్రపు అట్టడుగున క్రింద వున్నది, మైక్రోస్కోపు క్రిందపెట్టి చూపించారు. ఇంకా రకరకాల, ధగధగ మెరిసే రాళ్ళు, ఆకుపచ్చవి, గులాబివి, ఎన్నో రకాలు మనం చూడనివన్నీ.

తిమింగిలం అనే పంజరం ఒకచోట పెట్టారు. మన పెద హాలులకు సరిపడవుంది దాని ఊపిరితిత్తులు, పక్క ఎముకలు అన్నీ వున్నవి. ఇంకా పులులు, సింహాలు, గాజు అలమారులలో, రకరకాల పక్షులు, పాములు చేపలు అన్ని జంతు జాలాలు, అమర్చారు. (బ్రతికినవి కావు) ఎక్కడకక్కడ గెన్ను ఉండి, మన సందేహాలు తీరుస్తారు. పెద్ద గాజుతొట్టెలలో, చాలా రకాల, చేపలు వున్నాయి. వాటికి నీళ్ళలో వున్న ఆక్సిజను చాలదని, రబ్బరు గొట్టాలద్వారా, పంపుచేసి పంపుతున్నారు. అన్ని రకాలజంతువుల అస్థిపంజరాలు, మానవునిది కూడా వున్నాయి. నదులు, కొండలు, వర్షం, మంచు ఎలా ఏర్పడేది, బొమ్మలు తయారుచేసి చూపించారు. జియోఫిజిక్సులో, నీళ్ళలో కరెంటు పాస్ చేసి, గులాబీలు పడవేసి, వచ్చిన వాళ్ళని ఎంతమంచి పువ్వులో ఒకటి తీసికోండి, అంటున్నారు. తెలియనివాళ్ళు ముట్టుకుని 'అబ్బా' షాకిచ్చింది, అంటున్నారు. ఇదో వినోదం.

ఇంకా అగ్ని పర్వతం, ఉష్ణకుండం నమూనాలూ, అమర్చారు. ఇవి పొగ క్రక్కుతూ నీరు చిమ్ముతూ వున్నాయి. ఇంకా బోటనీ సెక్షన్లో ఆంధ్రలో పండేరకరకాల ధాన్యాలూ వాటి విత్తనాలు, పళ్ళు, కాయలు, మొక్కలు, పూలజాతులు, అన్ని వివరంగా వున్నాయి. మొక్కలు, కాంతిలో ఎలా ఎదుగుతాయో, చూపిస్తున్నారు. అరటి పళ్ళు రిఫ్రిజిరేటరులో వుంచి చూపిస్తున్నారు. ఏంటీ బయాటిక్సు, మందులయిన పెన్సిలిను, మొ॥ తయారుచేసే మొక్కలు, సముద్రంలోని రకరకాల నాచు మొక్కలు పెద్దపుట్టగొడుగులాటి మొక్కలు చూపించారు. చాలా చిన్న పురుగులు, సముద్రంలో అడుగుభాగాన్ని తినేసేవి, వున్నాయి! ఇంకా చాలా ఏళ్ళ క్రితం, కర్రలు, రాళ్ళ క్రిందమారాయని వాటని చెక్కి ఇంకా వాటిలో మొక్క మూలగుణంవుందని చూపించారు. ఇంకా విత్తనాలు లేక, ఆకులుపడి మొలిచే, ఒకరక మైన. నీటిమొక్కలు చూపించారు. ఇంకా టెక్నాలజీకి సంబంధించినవాటిలో బొగ్గు తీసే యంత్రాలు, 'రేడియమ్' వున్నదికనిపెట్టే యంత్రాలు. రాగి మొ॥ ఖనిజాలు ఇసికలో కలసివుంటె, వాటిని విడదీసి చూసే పరికరాలు, గాజాని నున్నగా, కాటిల



"స్పోది"

సిన ఆకారంలో కోసే యంత్రాలు, అన్నీ వున్నాయి.

తరువాత 'లా' డిపార్టుమెంటులో బొమ్మలతో సహా రాజ్యాంగ వివరాలు అన్నీ వున్నవి. రాష్ట్ర, ఎగువ, దిగువ, శాసనసభలు, కేంద్ర శాసనసభ వివరాలు గీసిచూపించారు. పూర్వం చిన్నపిల్లలకు పెళ్ళిళ్ళు జరిగేవని చెబుతూ ఒక భర్త, భార్యని కొడుతున్నట్టు వున్న చిత్రం ఉంది. పూర్వం అలావున్నా బాలలకల మరణించినాసరేగాని, ఆడవాళ్ళకు విడాకులు లేవనీ, ఈనాటి రాజ్యాంగం ప్రకారం కొన్నిరకాల కారణాలు వున్నటయితే, కోర్టులో విడాకులు ఇచ్చేవిధం తెలియచెప్పారు. ఆస్తిలో ఆడపిల్లలకు, భార్యకు సమానవాటాలు వున్నవని చూపించారు. ఇంకా సుప్రీంకోర్టు వివరాలు, రకరకాల వివాదాలలో కోర్టు ఎలా తీర్పు ఇచ్చేది ఆ పుస్తకాలు చూపించారు.

తరువాత సంస్కృతిగ్రంథాల శాఖలో 16వ శతాబ్దంలో తాటియాకులమీద రాసిన భారతగ్రంథం, మెడలో వేసుకునే రుద్రాక్ష మాలలా వున్న చిన్న గుండ్రని తాటిఆకుల మీద రాసిన భగవద్గీత వున్నాయి. ఈ తరపు వాళ్ళమయిన మనకు అవి భూతద్దం పెట్టి చూసేగాని కన్పించవు, వాళ్ళశక్తి మెచ్చుకోతగది. ఇంకా బుద్ధుని, ధర్మపదంలో సూక్తులు. సంస్కృతి గ్రంథాల పేర్లు అన్నీ వున్నవి. మానవుని తల అంతా బొమ్మవేసి, క, ఖ, ఘ, ఙ, లు పలికినప్పుడు స్వరభేదాన్ని బట్టి, నాలిక, అంగుడుతోను, దంతాలతోను ఎలా, టచ్, అయేది చేర్చారు.

సంస్కృత భాషను పునరుద్ధరించమని రాశారు.

తరువాత తెలుగు ప్రాచీన శిలా శాసనాలు చూశారు. వాటిపై తెలుగు కవయిత్రులయిన, రంగాజమ్మ, ముద్దుపళని, మొదలగు వారి పేర్లు పన్నయ్యరాసిన మొదటి తెలుగు పద్యం ఉన్నాయి. తెలుగు మంత్రులలో ప్రసిద్ధిగాంచిన 32 మంది చిత్రాలువేసి వారిమీద. ముప్పయిరెండు పద్యాలు కట్టి వ్రాశారు.

ఒకచోట 'ప్రబంధ సుందరి' అని బోర్డు కట్టి తెరలోపల అందరికీ చూపిస్తున్నారు. ఒక అణా టిక్కెట్టు. ఏదో చాలా బావుంది కాబోలని నేను వెళ్ళాను. తీరా చూస్తే శ్రీనాథుడు వర్ణించాడు స్త్రీ ఇలా వుంటుందని 'జుట్టు మేఘాలలా వుందని ఆ ప్రకారం, ముఖం చంద్రమండలంలా వుందని అలాగే మోకాళ్ళు, తాబేటి చిప్పలలాగా, గోళ్ళు నక్షత్రాలలాగే అలాగే తక్కిన అవయవాలు వేసి చూపించారు. ఇలా వేసినందుకు 'ఆడవాళ్ళు. ఏమైనా అనుకోవచ్చు' అని పెన, 'సర్వం మిథ్య' అని రాశారు. బలే బావుందని నేను ఒకసారి కళ్ళు మూసుకుని సర్వం మిథ్య అనుకున్నాను. గోమూత్రికా బంధము, నాగబంధము మొ॥ పద్యాల వివరాలు, బొమ్మలతో సహా చూపించారు. ఆధునిక కవులయిన వీరేశలింగ, చిలకమర్తి, పానుగంటివారి పేర్లు వున్నవి. ఇంగ్లీషు లిటరేచరులో మిల్టన్. షేక్స్పియర్ మొ॥ వారి రచనలు, బొమ్మలు వున్నాయి షేక్స్పియర్ నిలువునా, ఆయన జ్ఞాపకార్థం

# ★ వంటలు ★

## దోసకాయతో

దోసకాయలు పెద్ద పెద్ద ముక్కలుగా తరుగవలెను. వుల్లిపాయలు కూడా తరిగి వుంచుకొనవలెను. పొయ్యిమీద గిన్నె పెట్టి కొద్దిగా నూనెపోసి ముక్కలనుబట్టి కొద్దికొద్దిగా లవంగాలు, ఏలకులు, దాల్చిన చెక్క, బిరంజి ఆకు జీడిపప్పు వేసి తరువాత వుల్లిపాయ ముక్కలు వేసి మూత పెట్టవలెను. వుల్లిపాయ వేగినతరువాత దోసకాయ ముక్కలను వేసి తగినంత వుప్పు, కారం, పసుపు వేసి మూత పెట్టవలెను. కొద్దిగా పచ్చి కొబ్బరికోరు, వేయించిన శనగపప్పు, గసగసాలు కలిపి మెత్తగారుబ్బి వుంచుకొనవలెను. ముక్కలు వుడికినతరువాత ఈ ముద్ద, కొద్దిగా పెరుగు వేసి కొంచెంసేపు వుడికినతరువాత దింపి వాడుకొనవలెను. పులుపు యెక్కువగా కావలసినవారు నిమ్మకాయరసం వేసుకొనవచ్చును. ఈ కుర్మా చపాతీలతో పెట్టుకొని తినుటకు కూడా బాగా వుంటుంది.

## దోసకాయ పచ్చడి

దోసకాయను పొయ్యిలో సన్నని నిప్పుల మీద కాల్చవలెను. అది బాగా వుడికిన తరువాత కడిగి విడదీసి ఆ గుజ్జునంతా తీయవలెను. చింతపండు సరిపడునంతగా తీసుకొని నీళ్లలో కొంచెంసేపు నానబెట్టి ముద్దవలె పులుసు తీసి గుజ్జులో కలుపవలెను. దానిలో తగినంత ఎండు మిరపకాయలు వేయించి పొడికొట్టి కలిపి తగినంత వుప్పు, పసుపు వేసి కలుపవలెను. తరువాత పొయ్యి మీద బాణలి పెటి కొదిగా నూనెపోసి ఎండు మిరపకాయలు, మినపప్పు, ఆవాలు, కరివేపాకు వేసి పోపు పెట్టవలెను. ఈ పచ్చడి చాలారుచిగా వుంటుంది.

కె. హెచ్. ప్రసన్న,
(విజయవాడ.)

## వాల్తేరులో వస్తుప్రదర్శనం

లండనులో ప్రతి ఏడు ఆయన నాటకాలు ప్రదర్శించే హాలు చిత్రం వున్నది. ఆర్టు గేలరీలో, బాగా తీసిన ఫొటోలు, సామాన్య చిత్రాలు, కొన్ని చేతిపనులు వున్నవి. అంతా చూశాకే, మనవాళ్ళు చాలా గటివాళ్ళే అని అనిపించింది. ప్రతి ఏడు కాన్వొకేషను అనంతరం ఇవి 4 రోజులు జరుగుతాయి. ఇవి విజ్ఞానాత్మకంగా, విలువకి పనికివచ్చేటుగా వుండుటచే, విశేషాలు వనితాలోకానికి రాసిపంపుతున్నాను. ఇన్నిరకాల వస్తువులు సేకరించిన యూనివర్సిటీవారు అభినందనీయులు. ★

## జొన్నరవ్వతో ఇడ్లీ

చాయజొన్నలుగానీ, పచ్చజొన్నలుగానీ రాళ్ళు లేకుండా బాగుచేయవలెను. తదుపరి అవి నీటిలోపోసి పిసికి నాలుగైదుసార్లు కడుగవలెను. కడిగిన జొన్నలలో నీరు లేకుండాచేసి నీడన ఆరబోయవలెను. ఆరిన జొన్నలను మరలుగాని, ఇంట్లోగానీ సన్నగా విసరించవలెను. (సన్నగా అంటే బొంబాయి రవ్వ మాదిరి) విసరినదానినుంచీ పిండి, రవ్వ, పొట్టు వేరుచేయవలెను. ఇది అంతయు ఒకరోజు ముందుగా చేసుకొనిన బాగుండును లేనియెడల ఆ రోజే పని శ్రమ ఎక్కువ.

ఒక శేరు రవ్వకు పావుశేరు చాయ మినప్పప్పు అవసరము. చాయ పప్పులేని వారు పావుశేరు పైన పొట్టు పప్పైనను పనికి వచ్చును.

రవ్వ, పప్పు రెండు వేరువేరు గిన్నెలలో నానపోయవలెను మూడు గంటలు నానిన తరువాత రవ్వ బుట్టలో వడవేయవలెను పొట్టు పప్పు ఐనఎడల పొట్టుతీసి ఇడ్లీ పిండి మాదిరి మెత్తగా కాటుకమాదిరి రుబ్బి ఆ పిండిలో రవ్వ వుప్పువేసి బాగా కలుపవలెను. ఉప్పు కలిసినతరువాత మామూలు ఇడ్లీ చేసినట్లే చేయవలెను. ఇవి వేడిమీద చాల రుచిగా నుండును. పచ్చజొన్నలైన యెడల కొద్దిగా పచ్చగా నుండును చాయ జొన్నలైన చెప్పువరకు భేదము తెలియదు పిండికలిపిన రోజే వండవలెను.

శారద,
(షాద్ నగర్.)

* * *

## మిరప ఆకుతో

మిరప ఆకుతో పప్పుపొడికూర :

మిరప ఆకు, పెసరపప్పు, కొత్తిమిరి, పచ్చిమిర్చి, పచ్చికొబ్బరి కోరు.

చేసేవిధానము: మనకు కావలసినంత మిరప ఆకును శుభ్రముగా కడిగి పురుగు లేకుండా చూసి తీసుకోవలెను. పెసరపప్పు రాళ్ళు లేకుండా చేసి ఒక పాత్రలో నానబెట్టవలెను పొయ్యిమీద బాణలి పెటి 4 స్పూన్ల నూనెపోసి నూనె కాగిన తరువాత ఆవాలు వేసి చిటపటలాడాక సన్నగా తరిగిన మిరప ఆకును మిరపకాయలను గిన్నెలో వేసి కలపాలి. దానికి తగినంత పెసరప్పుపోయాలి, ఉప్పు, ఎండు మిర్చి, పసుపుపొడి, కొబ్బరి కోరం వేసి గరిటెకాడతో త్రిప్పి దింపాలి. ఇది చాలా పొడిగా ఉండాలి.

## మిరపకాయతో కూర

మిరపకాయలు, టొమాటోకాయలు, మినపపప్పు, కొతమిరి, కొబ్బరికోరు.

చేసేవిధానము : కావలసినన్ని మిరప కాయలు టొమాటోకాయలు తెచ్చి సన్నగా తరిగి పెట్టుకోవాలి. పొయ్యి మీద బాణలి పెట్టి నూనె వేసి నూనె కాగిన తరువాత ఆవాలు కొదిగా ఇంగువ వేయాలి దీనికి తగినంత మినపపప్పు వేసి పప్పు దోరగా వేగిన తరువాత టొమాటోముక్కలు, మిరపకాయ ముక్కలు వానికి తగినంత ఉప్పు, ఎండుమిర్చి పసుపు పొడి వేసి కాడతో త్రిప్పాలి కూర ఆఖరు దశకు వచ్చిన తరువాత నువ్వుల పప్పు, కొత్తిమిరి, వేసి దించి మూతపెట్టాలి. దింపే ముందు కొబ్బరికోరు వేయాలి. విటి రుచి చేసిచూసే మీకే తెలుస్తుంది.

—సవిత, (తిర్మలాపుర, కరీంనగర్.)

## గృహవైద్యం

చలికాలం. ఆకలికాలం మటుకు కాదు. మందంగా ఉంటుంది. ముఖ్యంగా కాస్త వయసుమళ్ళిన వారికైనా, అజీర్ణపు వ్యక్తులకయినా, బాలింతలకు, చిరుతిళ్లరాయుళ్లకూ ఈ కాలం భోంచేయడం, ఆ భోజనం అరిగించుకోవడం ఒక సమస్యే! ఇందుకు నేను ఒక మందు చెబుతాను. పొడి అన్నమాట.

చిన్న పిల్లలకూ ఈ పొడి కాస్త వేడినీళ్లలో కలిపి ఇస్తే రొంప, అజీర్తి ఎగిరిపోతుంది. ముఖ్యంగా యీ మందు 'బాలింతలకే' ప్రత్యేకించింది. కన్నవారు ఆరు నెలలవరకూ మా పత్యంగా వుండాలంటారు. ఇప్పుడెవరు వుంటున్నారు గానియ్యండి. కనీసము ఈ మందు చేసి పెట్టుకుంటే చాలా మంచిది బాలెంతలకు. కిరాణా దుకాణంలో ఈ క్రింది జాబితా ఇస్తే వాళ్లే ఇస్తారు. పేర్లు చూసి విస్తుపోకండి.

మోడి, పరంగిచెక్క, తాళిసపత్రి, అతిమధురం, దుంపరాష్ట్రం, నలజీలకర్ర, పిప్పళ్ళు, పొడపత్రి, జాజికాయ, ఆళి, మునగబంక, జాపుకాయ, వసగోరు, ఏలకాయలు, కొరాంజనం, శొంఠి, మిరియాలు, జీలకఱ్ఱ, లవంగాలు, ద్రాక్ష (ఎండువి), కర్జూరకాయలు, గంటుబారంకి, కురాసాని వామం, వాయువిళంగ, చక్కెర, నెయ్యి, తేనె.

ఈ మందులన్నీ ఎంతో ఖరీదవుతుందనుకోనేరు. అంతా ఐదు రూపాయలలోపుగా కూడా తీసుకోవచ్చు. అన్నిటినీ శుభ్రం చేసుకొని, తేనె, నెయ్యి, చక్కెర, కర్జూరకాయలు, ద్రాక్ష ఇవతల తీసి పెట్టుకోవాలి. కర్జూరపుకాయలు ముక్కలు ముక్కలుగా కోసుకోవాలి. మిగతా మందులు బాగా ఎండపెట్టి మెత్తగా దంచి జల్లెడపట్టాలి. కాటుకలాగ లేకపోయినా అంత మెత్తగా జల్లించాలి. ఈ పొడుం తడిలేని డబ్బాలో నిల్వపెట్టుకొని కొద్దికొద్దిగా 'కాయపుమందు' చేసుకోవచ్చు. చక్కెర పాకం పట్టి లేత

# వనితా వాణి



విద్యార్థినుల ఇబ్బందులపై పత్రికలలో జరుగుతున్న చర్చలు చూస్తూ ఉన్నాము. ఈ సందర్భంలో ఇటీవలి సంఘటన ఒకటి పాఠకుల దృష్టికి తీసుకురాదలచి ఈ లేఖ వ్రాస్తున్నాము. 15 రోజుల క్రితం హైదరాబాద్ నారాయణగుడా ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాల సమీపంలో పోలీసులు పదిమంది యువకులను అరెస్టు చేసినట్లు పత్రికలలో కూడా వార్త వచ్చింది. ఈ పదిమందిలోనూ నలుగురు కాలేజీ విద్యార్థులట. అరెస్టుకు కారణం వాళ్ళు ఆడపిల్లలను అల్లరి పెట్టడమేనట. ఈ 'బజారు ప్రేమికులు' పాఠశాల విద్యార్థులను గేలిచేస్తూ ఉండగా పట్టుబడ్డారనీ, తరవాత జామీనుమీద పోలీసులు వీరిని వదలి పెట్టారనీ తెలిసింది.

టి. సీత, జి. మహాలక్ష్మి.

* * *

## గృహ వైద్యం

పాకం. అందులో కావలసినంత పొడుం వేసి అడుగంటకుండా కలియపెడుతూ. నెయ్యి వేస్తూ రావాలి. ఆ తర్వాత తేనెపోసి కొద్ది సేపటిలో ఎండు ద్రాక్ష వేయించి సుంగు ముద్దపై పోయాలి. బాలింతలకు పెద్ద ఉసిరికాయంత మందివ్వాలి. ఆకలి బాగా వేస్తుంది. తిన్నది అరిగిస్తుంది. నెలల బిడ్డలకు కూడా తలంటిపోసే రోజున వేడినీళ్ళలో అయినా తలిపాలలో అయినా ఓ చిటికెడు పొడుం కలిపి ఇవ్వవచ్చు. మామూలు మనుష్యులకు తలనొప్పి వచ్చినా, ఓ గ్లాసుడు నీరు తెర్లనిచ్చి అందులో ఇంత ఈ మందు పొడి వేసి వేడి వేడిగా త్రాగితే తలభారం పదినిమిషాలలో తీసిపెడుతుంది. తలలో నీళ్ళు చేరనివ్వదు. ఇంటిలపాటి ఉపయోగించుకోవచ్చు ఈ కాయపుమందు.

ఎస్. ఎస్. మాధురి,
(నిడుబ్రోలు)

పుష్పగారు వ్రాసిన 'పార్వతి కొండ' వ్యాసము చాలా బాగుంది. వారికి మా ధన్యవాదాలు వనితాలోకంద్వారా తెలియపరుస్తున్నాము. ఇంకమీదట ఇటువంటి వ్యాసములు వ్రాసి మమ్మలను ఆనందపరుస్తారని ఆశిస్తున్నాము.

ఎ. ఉమ, వాణి, (మద్రాసు)

* * *

సి. రాధగారు వ్రాసిన 'శీర్షాసనము' వ్యాసమును చదివాను. వారు చెప్పినట్లు చేసినాను. చాలబాగుంది. వారు యీవిధముగా వ్యాయామములనుగురించి వ్రాసినందుకు నా అభినందనలు. రాధగారు వ్రాసిన వ్యాసములో ఈ ఆసనము వేసినతరువాత ఒకచోట స్థిరముగా కూర్చొని, కండ్లు మూసుకొని పరిపూర్ణ విశ్రాంతి పొందుట అవసరమని వ్రాసినారు. ఆవిధముగా చేయవలసినదే. నేను మరికొన్ని విషయాలు కూడా తెలుసుకున్నాను. ఆసనము వేయునపుడు కూడ ప్రతివారు కండ్లు మూసుకొనవలెను. యీఆసనము వేయువారు ఒకేసారి ఎక్కువసేపు ఉండకూడదు. అనగా క్రొత్తగ అలవాటుచేయబోయేవారు క్రమేణ ఎక్కువసేపు ఉండేదానికి ప్రయత్నించవలెను. ముఖ్యంగా కొంతిమంది పిల్లలకు వయసు వచ్చిన అనగా 16, 17 సంవత్సరములవయసు వచ్చినా వారికి వయసుకుతగ్గ జ్ఞాపకశక్తి ఉండకపోవుట చూచుచున్నాము. అటువంటివారికి వారి తల్లిదండ్రులు శ్రద్ధతీసుకొని ప్రతిదినము సూర్యోదయమునకు పూర్వము ఈఆసనము వేయించిన వారికి క్రమేణ జ్ఞాపకశక్తి వృద్ధియగును. ప్రతిఒకరు ఆడ, మగ, బాలురు, యువకులు, పెద్దవారు యీ ఆసనము వేసిన ఎల్లకాలము ఆరోగ్యముగానుందురు. ఇంకొకవిషయము గుర్తించుకొనవలెను. యీఆసనము వేయునపుడు కొంచెము ఆయాసముగనుండును. అటువంటి పరిస్థితిలో నోటితో యెన్నడును గాలిపీల్చరాదు. ముక్కుతోనే పీల్చవలెను. ఈ ఆసనము అయిపోయి, విశ్రాంతి తీసుకున్నతరువాత ఒక పావుశేరు టొమేటోరసము తీసి, కొంచెము చక్కెరకలిపి, అరసముగాని లేక పావుసేరు పాలు ఒక కోడిగ్రుడ్డుగాని తీసుకొనుట మంచిది. యీ ఆసనమువల్ల చాల యుపయోగములుకలవు. మొటిమలుపోవుట, ముఖమునకు అందము వచ్చుటేకాక, చిన్నవయస్సునసే వెంట్రుకలు నెరసిపోవుట తగ్గిపోవును. యీ ఆసనము వేసిన తరువాత, విశ్రాంతి తీసుకుని 20 సూర్యనమస్కారములు చేసిన ఆరోగ్యము చాల బాగుండును.

ఇ. హనుమయ్య (సంగారెడ్డి)

* * *

శ్రీ సీతారాం పెరుమాళ్ళగారు వ్రాసిన బద్ధకానికి మందు అనువ్యాసము చదివాను. బాగుంది. ప్రతివారు ఇదిచదివి ఆచరించి సుఖపడుతారనుకుంటాను. దీనిముఖ్య లక్షణములు ఇంకా కొన్ని వ్రాస్తున్నాను. మొదటిది అలక్ష్యం రెండవది అశ్రద్ధ. ఇవి రెండు త్వరగా పోగొట్టకుంటే వ్యాధి కూడా త్వరగా నెమ్మదిస్తుంది. జీవితములో మంచి వికాసము. తేజస్సు కలుగుతుంది.

ఎం. రామలక్ష్మి రంగనాథం,
(గుంటూరు)

★

# పాతకాలపు పాటలలోని హాస్యం

ఈ పాతకాలపు పాటలలో హాస్యం చిందించే సరసపాటలు సాధారణంగా పూర్వకాలం పెండ్లిండ్లలో వినబడేవి. రాను రాను ఆ పాటలు పాడడం ఫేషన్ కాకుండా పోయింది. కాని ఎవరైనా పూర్వకాలం వాళ్ళు కనుక ఆ పాటలు పాడినట్లయితే, పమిటలు నోటికడ్డం పెట్టుకు మరీ నవ్వుతారు. ఆపాటపాడే ఆమె పాడుతూ పాడుతూ తలఎత్తి ఆ నవ్వుముఖాలవెనుక తన్ను అవమానం చేస్తున్నట్లు భావించుకొని పాట ఆపేస్తుంది. పాడమని ఎవరైనా అంటే మరిచేమండీ అని తప్పించుకుంటుంది. నేటి నవనాగరిక వివాహాలలో పాటపాడేటంత వ్యవధి లేదు సరికదా, పురోహితుడు పూర్తిగా మంత్రాలు కూడా చదవక కొంత కొంత త్రుంచి పారేస్తున్నాడు.

పూర్వం అనగా పది పదిహేను ఏండ్ల క్రిందటి వరకు సార్వసాధారణంగా ఐదు రోజుల వివాహాలే జరిపేవారు. ఆ ఐదు రోజులలో ముత్తైదులు, పలలూ కొన్ని వందల పాటలు పాడేవారు. చిన్న పిల్లలు తమ బంధువులింటిలో పెండ్లి అంటే రెండు మూడు నెలలు కృషిచేసి రకరకాల పాటలు ఒక బైండునిండా వ్రాసి నేర్చుకునే వారు. అవి రకరకాల పాటలు చిన్నపిల్లలు సాధారణంగా బంతులపాటలు, గంధపాటలు, అలకపాటలు పాడేవారు. ఇంక సరసపాటలు, పెండ్లికుమార్తె చెల్లెలు (బావమీద); పెండ్లికుమారుని చెల్లెలు (వదినమీద) పాడేవారు. వాటిలో కొన్ని మచ్చుకి:

వదిన పాట:

వదినా! నీవెంత, బలుజాణవమ్మ
అరుగగ మాయింటి, కోడలవమ్మ ॥వ॥
చిన్నపట్నం ధారం. కుమ్మరిలులు గాదు
గిరగిర తిరిగేటి, గిలకొయ్యవమ్మ ॥వ॥
ఘనమైన మీ తండ్రి, కారెక్కించుట గాదు
బిరబిర గోదారి, గట్టెక్కవమ్మ ॥వ॥

అని, నూతన అధ్యాయంలో, అడుగుపెట్ట బోయే వదినగారికి కష్టసుఖా లందిస్తుంది. 'ఆడబొడుచు'

అదికాక

"మందూ పెట్టింది వదిన సుందరమూ వదిన, మంచీ మా అన్నకు, మతులే చెరిపింది ॥వ॥
"జీడికట్టెల తైలంలోన, జిలేడిపాలోని మహా చైన కరకజంలో ఏమో కలిపిందివదిన ॥మం॥
"బంగారు లడ్డులలో బనారసు కొజ్జాంగ న హెచ్చైన విలగ్గింజలో ఏమో కలిపింది వదిన ॥మం॥

అలాగే పెండ్లికూతురు చెల్లెలు బావమీద పాడుతుంది.

నాలుగు రాజ్యాలు, మాతండ్రి, వెదుక నల ముఖం పెండ్లికొడుక దొరకెర వా॥ మొదలు —

దూలకొండ తెచ్చి, గులిపింది చాలక
కంప నీరూ పోసి, కడగరమ్మ.
కంప నీరూ పోసి, కడిగింది చాలక
వలెగా తెప్పించి వలపరమ్మ

అనే వరకు పాడి పాడి, పెండ్లికొడుక్కి వుడుకుమోత్తనం తెప్పిస్తుంది మరదలు.

ఇంక భోజనం వద్ద పంక్తి పాటలు:

అంతా భోజనాల వద్ద కూర్చున్నప్పుడు మొగపెళ్ళివారు పాటలందుకుంటారు.

'కూరే వంకాయకూర, వేరే మారేమిలేదు
నిమ్మకాయ, నీరుమజ్జిగ, రాం రాం రాం'
(అన్న పాట మొదలు)
చాలు చాలు వియ్యాలవారి, మర్యాద లెంతో
వింతగా కనుపించెను, వేళకు వుప్మా
మేలైన కాఫీ లేకపోయిన లేదుగా॥ చాలు.

అని వియ్యాలవారి మర్యాదలు విమర్శించే సమయంలో వియ్యపురాలు వడ్డనకొస్తుంది అదిచూచి - చిన్న వియ్యపురాలు (అనగా వియ్యపురాలి చెల్లెలు (లేక తోడికోడలు).

వియ్యపురా లొచ్చెను, వినరుకొనుచు వడ్డనకను॥ వి॥

ఆ పాటలతో ముంచెత్తి భోజనాలు ముగించే సరికి పూర్తిగా రెండు గంటలు దాటేది.

మరి కొంత సరదా కలవారుంటే, సొడు పెట్టుకొని పాటలు పాడేవారు.

వోంగలాడీ మా వదినకు పెట్టరే, ఒక్కొక్క సొడు
పణతి చిన్నమా వదినకు పెట్టరే, పలువిరగ పదినూరు సొడ్లు॥ వ॥

అంతటితో భోజనాలు ముగించేవారు. హాస్యం చిందించే ఈ సరసపాటలు మాటు పడిపోవడం విచారించతగ్గ విషయం.

డి. భాస్కరమ్మ
(ఒంగోలు)

# తక్కువ ఖర్చులోనే ఎక్కువ హొయలు

ఆ అమ్మాయి ఎవరే?

సుబ్బులు పిన్నికూతురే! తెలీదూ?

దానిబట్టలలో అవేమిటి అలా తళుకు తళుకుమంటున్నాయి?

అద్దాలట!

నా వెనకాలజరిగిన ఈ సంభాషణ విని నేను వెనుకకు తిరిగిచూసేను వాళ్ళెవరూ, మా పెద్దమ్మ కూతుళ్ళు. నేను వెనుకకు తిరిగే సరికి వాళ్ళిద్దరూ, నా వద్దకువచ్చి, "సత్యవతీ" నీవు కట్టుకున్న పరికిణీగుడ్డ గజం ఎంత? అన్నారు. నేను మామూలుగా గజం రూపాయన్నర అన్నాను.

వెంటనే వాళ్ళిదరూ నామీద విరుచుకు పడ్డారు! ఏం గొప్ప! గజం 4 రూ॥ కుడని రూపాయిన్నర అంటావు? మేము ఏమీ ఎరుగనివాళ్ళమనా ఎగతాళి చేస్తున్నావ్? అన్నారు.

కాదక్కాయ్ ఇది రూపాయిన్నరే. ఈ అద్దాలు అవీ, నేనే కుట్టుకున్నాను అని పరిశాప్పేసరికి తల ప్రాణం తోక్కొచ్చినట్లయింది, నిజానికి నా బట్టలకన్నా, వాళ్ళు కట్టుకున్న ఖరీదు ఎక్కువ, కాని నా బట్టల మీద, వాళ్ళవి తక్కువ ఖరీదులాగున్నాయి. కారణం నా పరికిణీకి, అద్దాలు, రంగు, రంగు పూసలు, ఎంబ్రాయిడరీ పూవులు కుట్టుకున్నాను. బజారులో దొరకని మూలంగా పక్కింటివారి చంటిపిల్ల పాలసబ్బా తెచ్చి దానిమూతిని చిన్న, చిన్న నక్షత్రాలులాగు, చంద్రుడిలాగు, మామిడిపిందెలాగు కత్తిరించి వోణిమీద కుట్టాను. వీటితో తళ, తళమని లైట్ల వెలుగున. నాగుస్తేలు మెరుస్తూ చూచే వారి కళ్ళు జిగేలు మనిపిస్తున్నాయి.

మర్నాడు ఇంకోజత కట్టుకున్నాను. అవి నిన్నటి వాటికన్నా అందర్నీ ఆకర్షించాయి అవి ఎట్లాంటివో రాస్తే పాఠకులు నవ్వుతారు కూడాను. మాఅక్క చిరిగిపోయిన సిల్కు చీరలూ అవీ తిస్కొని, తీరుబడిగా, కూర్చొని, పాతిక వెడల్పున, నిలువునా, కత్తిరించి, మరొకగజం గుడ్డమీద పాడుగునా

(64-వ పేజీ చూడండి)






సింహావలోకనం : 3.

# మద్రాసుదే పైచేయి

దేశం మొత్తంమీద 1968 లో సెన్సారు అయిన చిత్రాలసంఖ్య 293. అంటే ఆ క్రితం సంవత్సరంకన్న పెరగనూలేదు; తరగనూ లేదు అన్నమాట.

ప్రాంతాలవారీగా చూసేటట్టయితే అన్ని కేంద్రాలలోనూ మద్రాసుదే పైచేయి అని విశదం అవుతుంది. మద్రాసు కేంద్రంలో చిత్రాల సంఖ్య ఆ క్రితం సంవత్సరంకన్న 11 ఎక్కువ (ఇక్కడి వివరాలు గతవారం ప్రచురించాము).

ఇక మిగతా కేంద్రాలలో వాటిసంఖ్య ఒకటో అరో తగ్గింది. బొంబాయిలో నిర్మితమైన కథాచిత్రాలు 1967 లో 128 అయితే 68 లో వాటిసంఖ్య 126. ఎక్కడ తయారైనా కాపీలు మటుకే ముఖ్యం అనుకునే పక్షంలో, మద్రాసులో తయారైన హిందీ చిత్రాలను (ఇక్కడావీటి సంఖ్య నిరుటి కన్న రెండు పెరిగి మొత్తం ఎనిమిదిఅయింది) కూడా కలుపుకుంటే, మొత్తం హిందీ చిత్రాలు 133 అవుతాయి.

ఇక, కలకత్తాలో చిత్రాలు 57 నుండి 49 కి తగ్గాయి. అయితే ఒక్కమాట చెప్పుకోవాలి. పరిమాణం మాట ఇలా ఉండగా, బెంగాలీ చిత్రం ప్రమాణం, తద్వారా భారతీయ పరిశ్రమ పేరు ప్రతిష్ఠలూ కూడా ఒక్కసారి హిమగిరి శిఖరాలను, అక్కడ

విక్రమ్ ప్రొడక్షన్సువారి 'రాజాజయసింహా'లో ఒక నృత్యదృశ్యం.



శ్రీ వెంకటేశ్వరా వారి 'సతీ సుకన్య'లో కృష్ణకుమారి.

## మద్రాసుదే పైచెయ్యి

నించి ప్రపంచ దేశాల ప్రశంసలనూ అందుకొన్నాయి. ముఖ్యంగా ఈ పనిచేసి పెట్టినది సత్యజిత్ రాయ్ 'అపరాజిత.'

1958 లో తయారైన మరాటీ చిత్రాలు 15, గుజరాతీ 1, అస్సామీ-2, పంజాబీ 1, ఒరియాలో ఒక చిత్రంకూడా నిర్మించబడలేదు.

* * *

మొత్తంమీద పరిశ్రమ పరిణామం అమోఘంగా పెరగకపోయినా తరగకపోవడం సంతోషించదగిన విషయం. అంతమాత్రాన పెరుగుదల భౌతికంగా పూజ్యం అనుకోనక్కరలేదు. హాలీవుడ్ కథను తీసుకొని హాలీవుడ్ చిత్రాలలాగే తీసే ధోరణి పెరిగింది. విదేశీవాళ్ళ సంగీతాన్ని యధాశక్తి దించేసేధోరణి పెరిగింది. ఇదికాక నిర్మాతల వర్గాలలో వాకబుచేస్తే తారల రుసుములు అతిరాలాతారాపథాన్ని అందుకొన్నాయని చెబుతారు. అలాగే అమ్మాళ్ళ నిడివి పెరగడం తగుతూ, తగ్గడం కొద్దిగా పెరుగుతూ వచ్చినదల్లా ఇపుడు తిరిగి పెరగడం పెరిగేవాయికి వస్తున్న సూచనలు కనిపిస్తున్నాయి. వీటని బట్టి, సాంఘిక చిత్రాలుగా - అధునాతన సాంఘికాలుగా ఫాన్సీడ్రెస్ వేసుకునే జానపద బావల సంఖ్యకూడా పెరుగుతానంటూంది. ఈ వాక్యాన్ని తిరగేసి అన్వయించుకున్నా పరవాలేదు.

ఇవి ఇలా ఉండగా, వీటికి పోటీగ నిలబడి కొత్తరకపు కథలతో కొత్త దృక్పథంతో ప్రయత్నించి చిత్రాలు తీసేవారు కూడా మెల్లగానే అయినా క్రమంగా పెరుగుతున్నారు.

మళ్ళీ వచ్చే సంవత్సరానికి నిరిబలం ఇంతకి పదింతలై పరిశ్రమ వృద్ధికివస్తుందని ఆశించవచ్చు. ★

## ఫిలించేంబర్

దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ టి. ఆర్. సుందరం తన పదవికి రాజీనామా ఇచ్చారు. ముడి ఫిలిం కోటాలు నిర్ణయించే కేంద్ర, ప్రాంతీయ మండలులలో ప్రాతినిధ్యం విషయమై కార్యవర్గంలో వచ్చిన అభిప్రాయ భేదాలు దీనికి కారణమని తెలుస్తుంది.

ఇపుడు కేంద్రసంఘంలో మద్రాసు ప్రతినిధులుగా శ్రీయుతులు బి. నాగిరెడ్డి, ఎస్. ఎస్. వాసన్ గారలను, ప్రాంతీయ మండలి సభ్యులుగా శ్రీయుతులు ఎ. ఎల్. శ్రీనివాసన్, ఎం. జి. రామచంద్రన్, వి. కె. సుబ్రహ్మణ్యం గారలనూ కార్యవర్గం సిఫార్సు చేసినట్లు తెలిసింది.



చందమామవారి "సిపాయికూతురు"లో సిపాయికూతురు వన్నాగా కుమారి జమున, నూతననటుడు సత్యనారాయణ.

## వార్తలు

ఎస్. కె. పిక్చర్స్ వారి పోషకత్వన ప్రథాన (హిందీ) చిత్రం 'చల్తీకానాం గాడీ' సంక్రాంతికి ఆంధ్రలో విడుదల అయింది. గంగూలీ బ్రదర్స్-అశోక్, కిశోర్, అనూప్ కుమార్ లు ముగ్గురు, మధుబాల హుషారుగా నటించిన ఈ చిత్రానికి సత్యేన్ బోస్ దర్శకుడు. సచిన్ దేవ్ బర్మన్ సంగీత దర్శకుడు. జోలీ అనే పాటకొటి ఇందులో విశేషాకర్షణ.

తల్వార్ ఫిలింస్ వారి కొత్త చిత్రం 'ఏక్ దిల్ సౌ అఫ్సానే'లో రాజకపూర్, మధుబాల ముఖ్య పాత్రలు నిర్వహిస్తున్నారు. కోర జానిసాకర్. సంగీతం శంకర్, జైకిషన్. దర్శకుడు, నిర్మాత ఆర్. సి. తల్వార్.

### అమర్ దీప్

తెలుగుదర్శకుడు తాతినేని ప్రకాశరావుగారు దర్శకత్వం వహించిన తొలిహిందీ చిత్రం 'అమర్ దీప్' నిర్మాణం పూర్తి అయింది. ఈ నెలలోనే విడుదల. శివాజీ ప్రొడక్షన్స్ వారు నిర్మించిన ఈ చిత్రం ఇదివరలో తమిళనాడులో విశేష ప్రజాదరణ పొందింది. ఇపుడు ఇందులో దేవానంద్, వైజయంతిమాల, పద్మిని, రాగిణి, బిపిన్ గుప్త, ప్రాణ్, జేవిడ్, ఓంప్రకాష్ మూక్రీ, జానీ వాకర్ మొదలగువారంతా నటించారు. రచయిత రాజేంద్రకిషన్. సంగీతం సి. రామచంద్ర.

తాతినేని ప్రకాశరావు ఇపుడు దర్శకత్వం వహిస్తున్న మరో హిందీ చిత్రం 'కాలేజ్ గర్ల్'.

### రాత్ కీ బాత్

యునైటెడ్ ఫిలిం మేకర్స్ వారు "రాత్ కీ బాత్" అనే చిత్రం నిర్మిస్తున్నారు. ఇందులో మీనాకుమారి నాయిక. షమ్మీ (ముఖామ్) కపూర్ హీరో. కుంకుం జీవన్, ధుమల్ మొదలగు వారు పాల్గొంటున్నారు.

రచయిత రాజేంద్రసింగ్ బేడీ, సంగీత దర్శకుడు దత్తారాం. దర్శకుడు చంద్రకాంత్.

ఎస్. పి. ఫిలింస్ వారి "మిలన్" ఈ మాసం విడుదల అయింది. అజిత్, నళిని జయవంత్, నిమ్మీ, డెయిసీ ఇరానీ, మారుతి మొదలగు వారు నటించారు. సంగీతం హంస్ రాజ్ బెహల్, దర్శకత్వం కిదార్ కపూర్.

* * *

శ్రీ వెంకటేశ్వర ప్రొడక్షన్స్ వారి పౌరాణిక చిత్రం 'పతిభక్తి' ఈ నెల 30న ఆంధ్రలో విడుదల అవుతోంది. కృష్ణకుమారి, అమర్ నాథ్, కాంతారావు, రమణారెడ్డి, పద్మనాభం మొదలగువారు ఇందులో ప్రముఖపాత్రలు నిర్వహించారు. మాటలు పాటలూ రామచంద్ (వర్ధంపేట) వ్రాశారు. సంగీతం ఘంటసాల సమకూర్చారు. దర్శకుడు చంద్రమోహన్.

ఎస్. ఆర్. ఫిలింస్ వారు 'కచదేవయాని' అనే పౌరాణిక చిత్రం తీస్తున్నారు. ఇందులో బి. సరోజాదేవి, విద్యావతి, కేదరి, అశ్వత్, సంపత్ పాల్గొన్నారు. మాటలు బి. ఎన్. చారి, పాటలు రాజశ్రీ వ్రాశారు. సంగీతం బాబూరావు దర్శకులు శ్యామ్, ఎమ్. ఆర్. ఎస్. మణి. ★

## విజయా వారి

# అప్పుచేసి పప్పుకూడు

తప్పులో కాలేస్తే వాల్మీకి రచయిత కావచ్చుగాని, అప్పులో కాలేస్తే ఆ సదుపాయం ఉండదని అపండితుల అపోహ. అయితే ఈ జీవితమే క్రితంజన్మలో కర్మఫలాలకు 'క్యారీఓవర్' అనీ, ఇందులో జీవిని కట్టిపడేసే అనురాగ బంధాలలో కొన్ని కేవలం మారు వేషం వేసుకున్న ఋణానురాగ బంధాలేననీ, అనిన్నీ 'హెచ్చరిక' గలవాడికి, అనుభవమే మార్గదర్శి అను భవతారక మంత్రం వంటపట్టినవాడికి – అప్పులో కాలెయ్యడం తప్పుకాదు సరికదా గొప్పకూడాను.

ఈ సత్యాలను బాగా మననం చేసుకొని, "వడ్డీలసంగతి ఇచ్చేవేళ చూసుకుందాం "అసలు"ని అసలు చేతిలోకి రానీ" అంటూ చతుర్విధోపాయాలా అప్పులుగడించే ఋణ ఋణవిధ రాముదాసు అనే ఆసామిని దృష్టాంతంగా చూపిస్తూ, అప్పు ముప్పు తెచ్చిపెడుతుందని నిరూపించి నీతిచెప్పడం 'అప్పుచేసి పప్పుకూడు' (విజయా ప్రొడక్షన్స)లో ఒక లక్ష్యం; కలువనుబట్టి విలుగకట్టి వ్యవహరిస్తూ, ఎలాగైనా ఏదో ఒక 'రాజా' అని పించుకున్న వాడికి తన మనవరాలికి చేసుకోవాలని ఆరాటపడే ఒక పెద్దబాగుల ముసలి ముకుందరావు హృదయాన్ని, జనరంజకంగా చిత్రించడం రెండవది.

ఈ విధంగా లక్ష్యశుద్ధి ఉంటే, సిద్ధి అసంభవం కాకూడదు. సి. ఎస్. ఆర్. (రాముదాసు), రంగారావు (ముకుందరావు), చక్రపాణి, ప్రసాద్, సదాశివబ్రహ్మంవంటివారు పూనుకొన్నప్పుడు ఉన్నత ప్రమాణాలు సుసాధ్యం అవుతాయని ప్రేక్షకులు ఆశిస్తారు. అయినా, కథచుట్టూ ముసిరిన అసంఖ్యాక పాత్రలకు పేరుపెట్టి, ఎడ్రసులు తొడిగి చుట్టరికాలు కలిపి, తెలపవలసి రావడం ప్రాధాన్యం వహించడంతో, విశ్వజనీనమైన ఋణశాస్త్రం వస్తువుగా గల ఈ కథలో వినాలనిపించేటంత ఋణఘణధ్వని వినబడలేదు; కనాలనుకునేటంత నిండుతనం కనబడలేదు. అయినా, రాముదాసూ, ముకుందరావుల పాత్రలు అందరికీ అభిమాన పాత్రలు కాగలవు. ఈ ఇద్దరినీ కలిపినిలిపే కథలో ఆహ్లాదకరమైన ప్రేమకథలు కలిసివున్నాయి. వాటిలో రామారావు-సావిత్రి, జగ్గయ్య-జమున, రేలంగి-గిరిజ, రమణారెడ్డి-డబ్బూ, అప్పులవాళ్లూ-బాకీవసూళ్లూ, నిర్మాతల, నటులకృషి-దాని సత్ఫలితాలూ-కలుసుకోవడం వృత్తాంతాలు.

పాత్రధారులు: ఎన్. టి. రామారావు, సావిత్రి, జమున, గిరిజ సూర్యకాంతం, ఇ. వి. సరోజ, జగ్గయ్య, రంగారావు, సి.ఎస్.ఆర్. రేలంగి, రమణారెడ్డి, ముక్కామల. శివరావు. బాలకృష్ణ, పద్మనాభం అల్లు రామలింగయ్య, వల్లం రామమూర్తి, ఆర్. నాగేశ్వరరావు. చదలవాడ కుటుంబరావు, ఎ. వి. సుబ్బారావు జూనియర్, మిక్కిలినేని. సుబ్రహ్మణ్యం, సుబ్బారావు.

స్క్రిప్టు: చక్రపాణి, ప్రసాద్. సదాశివబ్రహ్మం. మాటలు సదాశివబ్రహ్మం, పాటలు పింగళి నాగేంద్రరావు. సంగీతం సాలూరి రాజేశ్వరరావు. గాత్రధారులు లీల, సుశీల. ఘంటసాల, ఎ. ఎం. రాజా, మాధవపెద్ది సత్యం. శబ్దగ్రహణం కృష్ణన్.

కళాదర్శకులు: గోఖలే, కళాధర్. నృత్య దర్శకులు పసుమర్తి కృష్ణమూర్తి. ఛాయాగ్రహణం మార్కస్ బార్ట్లే. ఎడిటింగ్ జంబులింగం దర్శకుడు ఎల్. వి. ప్రసాద్. నిర్మాణం నాగిరెడ్డి చక్రపాణి.

రాముదాసుగారికి, ఈ చిత్రకథలో మొలతిండు మల్లె అప్పులు కుప్పతిప్పలుగా పెరిగిపోవడంతో, పరపతి నగటు సినిమా పాటలో భావంలా పూజ్యం అయిపోయే స్థితికి వస్తుంది. అంతలో 'రావుసాహెబ్' బిరుదువచ్చి ఆదుకుంటుంది. అప్పుడు ఈ ఋణగ్రహానికి 'దాఋణం'గా బ్రరపవి చేసి, ధనవంతుడైన దివాన్ బహదూర్ ముకుందరావుగారి ఆస్తిమీదకు మనసు పోతుంది. ఆయన మనుమరాలు మంజరిని తన కొడుక్కి చేసుకుంటే ఆస్తి చేజిక్కుతుందనీ అప్పుడు, అప్పులన్నీ తీర్చిపారెయ్యవచ్చుననీ దురాశ పడతాడు. అయితే ఆయనకి కాళీగావున్న కొడుకులు లేరు. ఉన్న కొడుకు రఘురాం ఒక్కడికీ పెళ్ళి అయిపోయింది. అతను సీమలో ఉన్నాడు. వైవాహికములందు...బొంకవచ్చు కాబట్టి, కోడలు లీల 'ఖర్చు'యిపోయినట్లు కొడుక్కి ఈ తీరంరాసి, అతన్ని మళ్లీ పెళ్ళికి సిద్ధంచేసి, ఇటు ముకుందరావుగారితో పెళ్ళి బేరాలు



'శ్రీకృష్ణపాండవయుద్ధం'లో కృష్ణుడుగా సాహూమోడక్.



'అప్పుచేసి' పప్పుకూడు చిత్రంలో జగ్గయ్య, రామారావు, సావిత్రి.

మొదలుపెడతాడు. లీల అన్నగారు రాజాను ఇది తెలిసి. ఖైదునుంచి విడుదల (కథానాయకుడు కావడానికి ముందు పూర్వాశ్రమంలో అతడు రాజకీయ నాయకుడు) అవుతూనే చెల్లెల్ని వెంటబెట్టుకుని రామదాసు దగ్గరకువచ్చి ఆయన చేస్తున్నపని తప్పు అని చెబుతాడు. బలవంతాన, చివరకి కోడలుపిల్లని పనిమనిషిగా ఇంట్లో ఉంచుకోడానికి రామదాసుగారు ఒప్పుకుంటాడు— కొడుకు సీమనించి వచ్చేసరికి ఈ పిల్లని చూసినా గుర్తించలేడన్న ధీమాతో. కాని పెళ్ళి ప్రయాణం మానడు. అందువల్ల రాజా, తన కాపరం నిలబెట్టడం కోసం ముకుందరావుగారి మంజరికి తన వాడికి పెళ్ళికాకుండా జాగ్రత పడవలసి వస్తుంది. దానికితోడు, అడు ఖైదునించి విడుదల అయినప్పుడు స్వాగతం ఇచ్చిన ఇద్దరిలో ఒకరు మంజరి అయినందువల్ల (నటులు రామారావు సావిత్రి అయినందువల్ల) వీళ్ళిద్దరూ కథారంభానికి పూర్వమే ప్రేమించుకొన్నట్లు మనం పసిగట్టవచ్చును. మంజరితాతగారికి హీనపక్షం మాజీమహారాజా అయినా కాని పెళ్ళికొడుకు కంటికి ఆనడు. రాజా ఒక బొంకులమ్రి మహారాజావేషం వేసుకుని వారియింట బస చేస్తాడు. రామదాసుగారు శతవిధాల ప్రయత్నించి అపూయిత్యప్పనులు చేయించి, ఆ 'రాజా' పై వత్తిడి తేవడంతో అతడు వేషం ఫిరాయించి వైరాగిగా తిరిగి ప్రవేశిస్తాడు. రామదాసుగారి కుడిభుజం భజగోవిందం (రేలంగి) బృందం అంతాకూడా రాజా, మంజరి, రఘురాం వగైరాలతో ఏకమై రామదాసుగారి ఎత్తులు సాగకుండా రకరకాల నాటకాలు ఆడుతారు. ఆయన కొన్ని బూటకాలు ఆడిస్తాడు. ఇలా నాటకాల్లమీద నడచిపోయి గమ్యస్థానం చేరుకుంటుంది కథ. ఆలోపల అప్పుల వత్తిడి ఎక్కువై, అపద్ధర్మంగా రామదాసుగారు గూండాలచేత తన ప్రత్యర్థిని తన్నించబోవడం, కాబోయే వియ్యంకుడి ఆస్తిలోంచి కట్నం బయానాగా రెండులక్షలు దొంగతనం చేయించడం వంటి అకార్యాలు చేస్తాడు. సృష్టికర్తలాగే కథకుడికీ తను సృజించిన పాత్రలన్నిటి మీదా సమానమైన ప్రేమ ఉండడంవల్లనూ, ఇందులో పెద్దలకు బుద్ధిచెప్పేది స్వయానా వారి బిడ్డలే కావడం వల్లనూ, పెదల మనసులు నొవ్వకుండా సున్నితంగా అపని చేయవలసి వచ్చింది. దండనార్హమైన అకార్యాలకు పాల్పడిన ఋణాన్న ఘుక్కు రాముదాసుగారు, ఈ విశ్వమైన సదుపాయంచేసి తనకు దండన కాక చివాటుకూడా తప్పించినందుకు పిల్లలను అభినందించాడు.

ఈ విధంగా ఎక్కడా దిగులు లేకుండా ప్రహసనం పద్ధతిలో ఆడుతూ పాడుతూ (రాజేశ్వరరావుగారి వరసలలో), సాగిపోయే ఈ చిత్రంలో నటీనటులందరూ యథోచితంగా తమ పాత్రలు నిర్వహించారు. సంగీతం జనరంజకంగా, పూర్వపు విజయచిత్రాల స్థాయిలో తరహాలో హాయిగా ఉంది.

ఘంటసాల, రాజా, లీల పాడిన 'త్రికళ గీతం' రచన, సంగీతరచన, ప్రకటనకూడా ఆహ్లాదకరంగా కుదిరాయి. సరోజ గేవా కలర్ నృత్యం ఒకటి ఈ చిత్రంలో విశేషం. ఒక విషాదగాథ ఆలంబనంగా రూపొందించిన ఈ నృత్యానికి సెట్ చాలా బాగుంది. అలాగే రామారావు కన్న కోరానిక స్వప్నం 'దమయంతి స్వయంవరం' కూడా బాగుంది. విజయవారి పూర్వచిత్రాల స్థాయిలో అన్నివిధాలా చేరుకుందనిపించక పోయినా, అనేకవిధాల ఈ కొత్తప్రయత్నం అభినందనీయం.



# 12 ఉత్తమ చిత్రాలు

## 'సిటిజన్ కేన్'

12 సార్వకాలిక ఉత్తమచిత్రాలలో ఒకటిగా ఎన్నిక అయిన (వీటిలో 9 మూకీలు, 3 టాకీలు) 'సిటిజన్ కేన్', సుప్రసిద్ధనటుడు, దర్శకుడు, విద్వాంసుడూ అయిన ఆర్సన్ వెల్స్ వ్యక్తిగతసృష్టి. ఆర్. కె. ఒ. పిక్చర్స్ వారు 1941 లో నిర్మించిన ఈ చిత్రానికి వెల్స్ దర్శకుడు. ముఖ్యనటుడు. స్క్రిప్టురచయిత. ఇందులో పాల్గొన్న ఇతర నటులు ఆగ్నెస్ మూర్ హెడ్, జోసెఫ్ కాటన్, ఎవరెట్ స్లోన్.

వెల్స్ శిల్పానికి చలనచిత్రకళలోనూ బ్రిటిష్ నాటకరంగంలో కూడా గౌరవం ఉంది. ఇది విలక్షణంగా ఉంటుంది. ఈ లక్షణమే దీనికి, పూర్తిగా కాకపోయినా కొంతవరకూ విశిష్టతను చేకూర్చిందని అంటారు. అంతమాత్రాన వెల్స్ ప్రతిభా, ప్రతిపత్తీ కేవలం ఈ వైలక్షణ్యమే అని పొరబడటం తగదు. ఇది కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. నటనలోనూ, చలనచిత్రకథనంలోనూ కూడా వెల్స్ అవలంబించే పద్ధతిలో, బహు అరుదనిపించే చైతన్యం వెయ్యి ఏనుగులబలం, విపరీతమైన వేగం వీటన్నిటినీ కలుపుకున్న జీవస్పందనం పుష్కలంగా ఉంటాయి. ఈ పద్ధతిలో వెల్స్ ఉద్ధతి కనిపించి ఒక్కొక్కసారి చిరాకు కూడా కలిగిస్తుంది. వెల్స్ పాత్రలూ, కథలో కోణాలూ, భవనాలూ, వెలుగునీడలూ అన్నీ కారుమేఘాలలా ప్రేక్షకుల మీదకి కమ్ముకువచ్చి దిగ్భ్రాంతులను చేసివేస్తాయి. అతను చెప్పదలచుకొన్న సంగతిని ప్రేక్షకుల గుండెలలో పదేపదే మారుమోగేలా ఎలుగెత్తి చెబుతాయి. మాక్ బెత్ కింగ్ లియర్ చిత్రాలలో షేక్స్పియర్ వాక్యాలకు వెల్స్ వ్యక్తిగత నిర్వచనాలు ఇందుకు నిదర్శనాలు.

'సిటిజన్ కేన్' చిత్రంలో ఒక సన్నివేశం

ఇతరుల దర్శకత్వాన తయారయ్యే చిత్రాలలో వెల్స్ నటించినా కూడా వాటిమీద వెల్స్ నీడపడుతుంది. వెల్స్ అనుకరణ సాధ్యుడు కాడు. అనుకరణ యోగ్యుడు అని కూడా అట్టేమంది ఢంకా బద్దలు కొట్టి చెప్పరు. నిజానికి కళలో అనుకరణ తగనిది. అయినా కొందరు ప్రయత్నించి దెబ్బతిన్నారు కూడా.

వెల్స్ వంటి కళాకారుడికి అన్నివిధాలా తగినకథ 'సిటిజన్ కేన్'. ప్రజ్ఞ చూపడానికి, కొత్తప్రయోగాలకి అవకాశములుగలకథ. ఇది ఒక పెద్ద అమెరికన్ ఉద్ధతుడి కథ. జీవిత వైకుంఠపాళీ మీద అధికారదాహంతో విశృంఖలంగా పొగరుతో దాదాపు బేఖాతిరీ తరహాలో తిరిగి పాముల నోట్లోంచి పడిపోయినంత చప్పునే నిచ్చెనలు కూడా ఎక్కేసి మళ్ళీ పడిపోతూ, లక్షసార్లు లక్షలు గడించి పోగొట్టుకొన్న వాడి కథ. అతని పేరు చార్లెస్ ఫాస్టర్ కేన్. పెద్ద వార్తాపత్రిక అధిపతి.

ఈ కథ, ఇందులోని ఈ ముఖ్యపాత్ర, సుప్రసిద్ధ అమెరికన్ పత్రికాధిపతి రెండాల్ఫ్ హార్స్ట్ లోంచి పుట్టాయని అంటారు.

కథనం ఫ్లాష్ బాక్ పద్ధతిలో జరిగింది. శిల్పం ఒక మనిషి జీవిత విశేషాలను కాక, ఆ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించడం లక్ష్యంగా గల 'ఎక్స్ప్రెషనిజం'. అంటే ఒక వస్తువును, వ్యక్తిగత లక్షణాన్ని, ఒక సంఘటనను విశ్వజనీన దృక్పథంలో విశాలార్థ స్ఫోరకంగా ప్రతిపాదించడం. ఇందులో కేన్ అధికారదాహాన్ని, అహంకారాన్ని, ఒ[illegible]త్వాన్ని వెల్స్ సార్వజనీనంగా ప్రతిపాదించాడు.

ఈ పని ఎంత గొప్పదో అంత కష్టం. ముఖ్యంగా విలక్షణుడైన ఒక వ్యక్తిత్వాన్ని అతనిచుటూ ఉన్న సమాజానికి, అది నిలచివున్న దేశానికీ, ఆపైన లోకాని

సంక్రాంతి పండుగరోజున విజయవాడలో కొత్తగా నిర్మించిన 'రాజకుమారీ థియేటర్'ను నవయుగఫిలింస్ అధిపతి శ్రీనివాసరావు అధ్యక్షతన జరిగిన సభలో, గోగినేని వెంకటేశ్వరరావు ప్రారంభోత్సవం జరిపారు. ఎడమవేపు ఉన్నవారు దర్శకనిర్మాత తిలక్.

ఒక హిందీ సంగీత దర్శకుడి తొలి చిత్రం పెద్ద హిట్ అయింది. అది ఆమాట అనిపించుకున్న మూడోనాడు ఒక నిర్మాత అతనింటికివెళ్లి తన చిత్రానికి బుక్ చేసుకున్నాడు, 25 వేల రుసుముకి.

అయితే రేపే రికార్డింగు రికార్డింగు ఆరంభిద్దాం. పాటలు రెడీగా ఉన్నాయి అన్నాడు ప్రొడ్యూసరు.

సంగీతదర్శకుడు తెల్లబోయి, "మరి వరసలో. నేను వరసలు కట్టొద్దూ?" అన్నాడు.

నిర్మాత తమాషాగా నవ్వి, తన దగ్గిర అట్టపెట్టి తీశాడు. "ఇదిగో నండి బెస్టురికార్డులు. ఈ మ్యూజికు చాలు. మీరు దగ్గిరుండి రికార్డింగు చేయించాలి అంతే, కొత్త ట్యూనులు అవసరంలేదు."

సంగీతకారుడు ఓ క్షణం ఆలోచించాడు. "అయితే మీ క్కావలసింది నా పేరన్నమాట. అయితే ఫీజు 50 వేలు. నా మ్యూజిక్ అయితే పాతిక చాలు. మీ రిచ్చేదయితే నా పేరు పోతుంది కాబట్టి ఆనక బతకడానికి డబ్బవసరం కదా" అన్నాడు,

ప్రొడ్యూసరు ఇంకా అతన్ని బుక్ చెయ్యలేదు. బహుశా నెక్స్ట్ పిక్చరుకి చెయ్యవచ్చునని పుకారు.

పటించడం అనేది చిటికలో హాస్యాస్పదం అయిపోగల ప్రమాదం ఉంటుంది. ఈ కార్యాన్ని ఆర్సన్ వెల్స్ విశేషమైన ప్రతిభతో నిర్వహించి ప్రేక్షకులను విభ్రాంతులను చేశాడు. చలనచిత్ర చరిత్రలో ఒక ప్రత్యేక అధ్యాయాన్ని వ్రాశాడు. ఇందులో వాడితనం, పనివాడితనం కూడా ఉన్న చిన్నచిన్న సన్నివేశాలు ఎన్నో ఉన్నాయి. "ఒక్కొక్కసారి పనివాడితనం వల్ల కథన శిల్పంలో వాడితనం వేడితనం దెబ్బతిన్నా మనకి ఆక్షేపణ ఎబ్బెట్టుగాతోచదు" అని ఒక విమర్శకుడు వ్రాశాడు. వాసవికతని పోషించడానికి ఇందులో పాత్రలు రెండు మూడేసి ఒక్కసారిగా మట్లాడేస్తాయి. గొణుక్కుంటాయి. సగంలో ఊరుకుంటాయి. అర్థంలేకుండా మాట్లాడాయికూడా.

కేన్ తన జీవితం అంతా ఏ టివాళ్లి ప్రేమకోసం ఆకాంక్షించాడు. అతనికి అది లభించలేదు, కారణం: ఏ టివాళ్లిని ఆదరించడం అతని చేత కాకపోవడమే. చిత్రంపొడుగునా చూపించిన కేన్ జీవితంపొడుగునా అతని అహంకారం తిక్క, అసమర్థురాలైన తన భార్య గొప్పగాయని అని నమ్మి, లక్షలాది ప్రజలను పత్రిక ద్వారా నమ్మించాలన్న అతని పట్టుదలా, పత్రికా విమర్శ ద్వారా ఈ ఊహాగానంలో అపశ్రుతి పలికించిన తన ఏకైక ఆప్తమిత్రుడిని కూడా సైరించలేక బర్తరఫ్ చేసిన ఆ మనిషి కాఠిన్యం మొరటుతనం చూస్తే 'ఈ మనిషి మొరటు పనులు చేస్తాడు. మొరటుగా కనిపిస్తాడు కాని వస్తుతః మొరటువాడు కాడు. మంచివాడు, అని మనకు అనిపిస్తుంది. సానుభూతి కలుగుతుంది. ★

## ఆంధ్రాభ్యుదయోత్సవాలు



పి. బెనర్జీ

ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన నలభైయైదు కళాశాలల ఆధ్వర్యాన మొన్న డిసెంబర్ 18 నుండి 21 తేదీవరకు హైదరాబాదు నగరమందు ఆంధ్రాభ్యుదయోత్సవాలు జరిగాయి. నీలం సంజీవరెడ్డిగారు ఉత్సవాలను ప్రారంభించారు. యమ్. ఆర్. అప్పారావుగారు ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించినారు. విశ్వనాథ సత్యనారాయణ, రాయప్రోలు సుబ్బారావు, దివాకర్ల వెంకటావధాని, వానిలాల గోపాలకృష్ణయ్య, ప్రయాగ నరసింహశాస్త్రి, గౌతమరావు, తాపి ధర్మారావు, పర్సా వెంకటేశ్వరరావు, జమ్మలమడక మాధవరామశర్మగారలు ఉపన్యసించారు. వివిధ కళాశాలలకు చెందిన విద్యార్థి, విద్యార్థినుల సంగీత, నృత్య నాటక ప్రదర్శనలు జరిగాయి. నాలుగురోజుల కార్యక్రమంలో పదునాలుగు నాటికలు ప్రదర్శింపబడినవి. సినీదర్శకులు తాపి చాణక్య, రామినీడు, లాడిపార్ట్‌మెంట్ కార్యదర్శి సూర్యనారాయణస్వామిగారలు న్యాయమూర్తులుగా వ్యవహరించినారు. హైదరాబాదు సాయం కళాశాలవారు ప్రదర్శించిన 'పాపనాశం-ధర్మసత్రం' నాటికలో 'చిన్నా' పాత్ర ధరించిన పి. బెనర్జీ ఉత్తమ నటుడుగా ఎన్నికైనాడు. నాటికల పోటీలో ఉత్తమ నటిగా మహిళా కళాశాల వారి 'విజేత' నాటికలో రుక్సానా పాత్రను ధరించిన కుమారి ఉమ ఎన్నికయినది. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డి. యస్. రెడ్డిగారు బహుమతులు పంచిపెట్టారు. ★



సుకృత లక్ష్మీవిలాస్ (మద్రాసు) సభవారు ఇటీవల మద్రాసు సౌందర్యమహల్ లో 'రామదాసు' నాటకం ప్రదర్శించారు. అందులో తానీషాగా డా॥ ఎం. వి. రావు, కబీరుగా పులిపాటి లక్ష్మీనారాయణ.

# న్యూఢిల్లీ లేఖ

(7-పేజీ తరువాయి)

ఉత్పత్తి ఏడాది ఏడాదికీ పెరుగుతోంది. వరదలొచ్చినా, వానలు కురవక పోయినా, దేవుడు చిన్న చూపుచూసినా, మానవుడు చిన్నచూపు చూసినా చెరకుపంట పెరుగుతూనే ఉంది. దీనికి కారణం ఏమీ లేదు, చెరకు ధరకు గ్యారంటీ ఉండటమే. ఆహారం పంటలకు అటువంటి గ్యారంటీలు లేవు. 16 ఏళ్ళ నుంచీ అధిక ఆహారోత్పత్తి ఉద్యమం ముమ్మరంగా జరుగుతోంది. వ్యవసాయదారుల సమావేశాలు జరుగుతున్నాయి. హెచ్చు పంట పండించిన వారికి బహుమతులు ఇస్తున్నారు. అయినా భారతదేశంలో ఇదివరకెన్నడూ లేని తిండికొరత ఏర్పడింది దీని భావం ఏమిటంటే, మనుషులు డబ్బుకోసం పనిచేసారు గాని సిద్ధాంతాల కోసం కాదు. ఆహారధాన్యాల ధరలకు గ్యారంటీ ఉంటే ఈ దేశంలో ఆహారోత్పత్తి తప్పకుండా పెరుగుతుంది; జనాభా ఎంత పెరిగినా అంతకంతా ఆహారోత్పత్తి కూడా పెరగగలదు.

అయితే చెరకు పరిస్థితి ఆదర్శప్రాయంగా ఉందని కాదు. లోగడకంటే ఎక్కువభూమిలో చెరకు వేస్తున్నారు. చెరకు వ్యవసాయం బాగా పెరిగింది. కాని ఒక మణుగు చెరకుకు ఎంత చెరకురసం లభిస్తున్నదీ లెక్కచూస్తే మన దేశం మిగతా దేశాలకంటే బాగా వెనకపడి ఉందని తేటతెల్లమవుతుంది. మనుషులు మరి కొంత కష్టపడి పనిచేస్తేగాని చెరకురసం ఎక్కువరాదు. ధరలకు గ్యారంటీ లేనంత కాలమూ ఎన్ని తీర్మానాలు, నినాదాలు చేసినా ఏమీ లాభంలేదు.

రాజకీయవాదికీ రాజనీతి వేత్తకు ఒక పెద్ద తేడా ఉంది రాజనీతివేత్త ముందుతరం ప్రజల్ని దృష్టిలో పెట్టుకుని పనిచేస్తే, రాజకీయవాది రాబోయే ఎన్నికల్ని దృష్టిలో పెట్టుకుని పనిచేసాడు. ఎన్నికలతో ముడి పెట్టకుండా ఉంటే పంచవర్ష ప్రణాళిక స్వరూపం మరోరకంగా ఉండేది. ఇప్పుడీ ప్రణాళిక కేవలం కాంగ్రెసుపార్టీకి ఎన్నికల ప్రణాళిక అయివూరుకుంది.

* * *

సఫ్దర్ జంగ్ ఆస్పత్రి అభివృద్ధి కార్యక్రమం చురుకుగా జరుగుతోంది. ఈ ఆస్పత్రిలో వైద్యస్థాయి బాగా ఉన్నదనటానికి నిదర్శనంగా—రాజధానిలో ఇంకా ఎన్నో పెద్దపెద్ద ఆస్పత్రులుండగా ప్రధాని నెహ్రూ తన మనుమణ్ణి ఈ ఆస్పత్రికే తీసుకువెళ్లారు.

ఈ ఆస్పత్రిని ఆలిండియా మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌తో విలీనం చెయ్యటానికి అంతవాల సంఘంకూడా వ్యతిరేకించింది.

ఈ ఆస్పత్రిని పూర్తిగా ఆధునికం చేస్తున్నారు శిశు చికిత్సా విభాగం చక్కగా తయారవుతోంది. ఇది వచ్చే మార్చినాటికి సిద్ధమవుతుంది. మార్చినాటికి 140 మంచాలుగల ఎక్స్‌రే చికిత్సావిభాగం కూడా సిద్ధమవుతుంది. నర్సుల హాస్టలులో సగం తయారైంది.

1959 60 సం॥లో 120 మంచాలుగల ప్రసూతి విభాగము, 80 మంచాలుగల జీవి కాలజీ విభాగమూ, 50 మంచాలుగల వ్రణ చికిత్సావిభాగమూ నిర్మించటానికి ధనం మంజూరైంది.

కర్నల్ ఆర్. డి. అయ్యర్, కర్నల్ ఎమ్. ఎస్ రావుల కృషిఫలితంగా నిపుణులూ, శ్రద్ధాళువులూ అయిన డాక్టర్లు ఇక్కడ పనిచేస్తున్నారు; మరి కొందరు శిక్షణ పొందుతున్నారు. ఈ ఆస్పత్రికి ఒక్కటే లోపం. అంటువ్యాధుల విభాగం లేదు. న్యూఢిల్లీ నుంచి అంటు వ్యాధులుగల రోగులను పదహారు మైళ్ళ దూరాన ఉన్న పాత ఢిల్లీ, కింగ్స్‌వే వద్దగల విసాలేషన్ హాస్పిటలుకు పంపించాల్సి వస్తోంది. సఫ్దర్ జంగ్ ఆస్పత్రిలోనే ఒకవిభాగాన్ని నిర్మిస్తే న్యూఢిల్లీకి చాలా సహాయంగా ఉంటుంది ★

# ★ రాజధాని కబుర్లు ★

[5-వ పేజీ తరువాయి]

వేసవికాలం మండుటెండవంటి వెలుతురు రంగస్థలంమీద ప్రసరిస్తేకాని నటరాజుకు కొబ్బరికాయ కొట్టలేరు మనవాళ్ళు. చీకటికీ వెలుతురికీ మధ్యనున్న భావాలను ప్రసరించదు మనరంగస్థలం. మంచివాడు మంచివాడే; చెడ్డవాడు చెడ్డవాడే. ఇదేవిధంగా చీకటికీ వెలుతురుకీ మధ్యనున్న కాంతి భేదాలు మనవారికి అర్థం కావు.

ఒకవిధంగా ఇదీ మంచిదే! మనం విశ్వసించిన నాటక ప్రదర్శనా విధానాన్ని అనుసరించి, జీవితంలో ఒక భాగం—ఒక ఖండం—రంగస్థలంపై ప్రదర్శించబడుతూందనే భ్రాంతి ప్రేక్షకులకు కలగాలి. నాటకం చూస్తున్నామన్నది మరిచిపోవాలి నాటకం చూస్తున్న ప్రేక్షకులు. ప్రేక్షకుల భ్రాంతిని నాశనం చేసే సాధనాలన్నీ పరిహరించాలి ప్రదర్శకులు.

ఈ భ్రాంతిని కల్పించడంలో నాటకం, నటులు ఏవిధంగా తోడ్పడాలో, ప్రదర్శకులు ఉపయోగించే యాంత్రిక సాధనాలు కూడా అదేవిధంగా తోడ్పడాలి. రంగస్థలంపై జరిగే మార్పులు ప్రేక్షకులదృష్టి నాకర్షించకుండా ఉండాలి; ప్రేక్షకుల భ్రాంతిని నాశనం చేయకుండా ఉండాలి. రంగస్థలంపై ప్రసరింప చేయబడే వెలుతురు క్రమక్రమంగా మార్పులు చేయబడకపోతే—ప్రదర్శన లక్ష్యమే గాయపడుతుంది.

అమత్యపరిషత్తులో ప్రదర్శించబడిన ఒకానొక నాటకంలో హఠాత్తుగా రంగస్థలంపై దీపాలన్నీ ఆరిపోయాయి. గురగుర శబ్దంతో స్పాట్ లైట్ వెలిగింది; అటూ ఇటూ వెళ్లింది; చివరికి ఒక వేషధారిని కనుగొంది. 'అమ్మ బాబోయ్! స్పాట్ లైట్ కూడా తెచ్చారు చూశారా!' అనుకొని బోలెడంత ఆశ్చర్యపోయారు ప్రేక్షకులు—ప్రేక్షకుల్లో అమాయకులు. అమాయకుల్లో న్యాయమూర్తులు. స్పాట్ లైట్ వేస్తే పరిషత్తు బహుమానం రావచ్చు; కాని రసస్పష్టిమాత్రం జరగదు.

మీవద్ద 'డిమ్మర్లు' ఉండి, ప్రేక్షకుల దృష్టి నాకర్షించకుండా ఉపయోగించగలిగితే—స్పాట్ లైట్ తప్పక ఉపయోగించండి. లేకుంటే—స్టేజి విలన్ నంబర్ త్రీ: స్పాట్ లైటును సాధ్యమైనంత దూరంలో ఉంచండి.

## ఇది మన రాజధాని!

జూన్ 1959 లోగా 25 000 టన్నుల ఒకరకం వేరుశెనగ ఎగుమతి కోటాలు ఉత్పత్తిదారుల సహకారసంఘాల కియ్యాలని గత నవంబరులో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఒక్కొక్క సహకార సంఘానికి 25 టన్నుల మొదలు 100 టన్నులవరకు కోటా ఇస్తారు.

ఐతే—సహకార సంఘాలు దరఖాస్తులు పెట్టుకోవాలి. ఈ దరఖాస్తులు, సహకార సంస్థల రిజిస్ట్రారు ఇచ్చే సర్టిఫికెట్‌తో సహా, ఢిల్లీకి జనవరి 10 వ తేదీనగాని, అంతకు ముందుగాగాని చేరాలి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వశాఖల్లో ఒక శాఖకి హఠాత్తుగా జన సేవ చేద్దామని బుద్ధి పుట్టింది. ఆఖరు తేది దాటిన రెండు రోజులకి—జనవరి 12 న—పత్రికా ప్రకటన చేసింది: ఎగుమతి పెర్మిట్లు కావలసినవారు పదో తేదిలోగా దరఖాస్తులు దాఖలు చేసుకోమని!

ఇది మన ప్రభుత్వ కార్యనిర్వహణా విధానం!

ఇది హైదరాబాదు—మన రాజధాని నగరం! ★

## ★ జీవనలీల ★

(19 వ పేజి తరువాయి)

దాహం వేసినపుడు దప్పిక తీర్చుకుంటారు. నిద్ర వచ్చినపుడు నిద్రపోతారు. ఇవితప్ప మిగిలిన జీవితమంతా మనం కల్పించుకున్నదే. తమని భ్రమ పెట్టుకోటానికి కాకపోతే ఈ వృథాకష్టాన్ని ఎందుకు తెచ్చిపెట్టుకుంటారు? మానవుల్లో చాలా మందికి దీన్ని అర్థంచేసుకునే సహనం కూడా ఉండదు. జీవితంలో ఎప్పుడూ ఈ భ్రాంతి తొలగిపోనూ పోదు. అర్థం చేసుకోగల శక్తి లేనప్పుడు ఆ భ్రమ భ్రమ ఎలా అవుతుందసలు? దాన్ని తెలుసుకున్న వాళ్ళకి కొందరికి మాత్రం చాలా కష్టం వేస్తుంది. జీవితమంటే తెలుసుకున్న వాళ్ళకి – విశిష్టమైన జీవితం గడపాలని కాంక్షించే వాళ్ళకే ఈ దుఃఖం. అంటిపెట్టుకోవాలని ప్రయత్నించినప్పుడు ఇదంతా భ్రాంతి అని తెలిసిపోతుంది. అంచేత ఇలాంటి వాళ్ళు జీవితంలో ఏదో పెద్ద ఆశించి కూచోవడం చాలా తప్పు. ఎంత ఆశిస్తే అంత దుఃఖాన్ని పొందవలసి వస్తుంది. నేను మొదట్నుంచీ ఎంతో 'ఖయాలీ'గా ఉంటూ ఉండేవాణ్ణని, బాధ్యతారహితంగా ఎప్పుడెలా తోస్తే అలా చెయ్యటమే కాని, జీవితాన్ని దిద్దుకోవటానికై ప్రయత్నించినవాణ్ణి కానని; ప్రపంచంలో పెద్ద ప్రయోజకుడినవాలని తలపగలకొట్టుకుని యెరగను అని నీకు తెలుసు. ఇలా ఎందుకు తయారయానో ఎప్పుడూ ఎవరికీ చెప్పలేదు. నాకు చాలా కాలం క్రితమే తెలుసు. జీవితంలో ఏదో పెద్ద ఆశలు పెట్టుకుంటే నేనూ నీలాగానే అయేవాణ్ణి జయా. చాలా సమన్వయించుకుని చూసి అంతా భ్రమ అని తెలుసుకున్నాను. అప్పట్నుంచీ ఎప్పుడేది దొరికితే దాన్నే కావాలనుకున్నాను – పట్టుదలతో ఇది కావాలని ఏదీ కోరలేదు. దొరికినదాన్ని దక్కించుకున్నాను. కాని దేనికీ ప్రత్యేకంగా ఆశించలేదు. ఎంత లాభించినా దాన్ని తేలిగానే తీసుకుంటాను. మతిని ప్రేమించానన్నావు. రేపు ఒకవేళ ఆమెతో నాకు తెగతెంపులంటూ కనుకవస్తే రెండురోజుల్లో మళ్ళీ మామూలు మనిషిని కాగలను. మతిచేత నేను కాళ్ళు దాకా పిసికించుకుంటాను జయా!

"కాళ్ళు పిసికించుకుంటున్నావా, ఛేవ్-పిసికించుకో. ఏదో ఒక అద్భుతమైన దాన్ని తెగించి చెయ్యకపోతే – అసలు ఎలా బ్రతగ్గలవు నువు? నేనే కనుక మతినయినట్లయితే—"

"ఇంకదైనా చేస్తే అది అద్భుతం – తెగింపు కావొచ్చు. ఆనందంగా బ్రతకాలనుకోవటం తెగింపా జయా! తెగింపుగా ఏదైనా చెయ్యకపోతే—"

"ఆఁ అవన్నీ నాకు తెలుసులే కాని, నువ్వాపేటి ఉపన్యాసం దంచకు కుముద్. సాయంత్రంవెళ్ళి ఇలుమారుకునివచ్చి, రేపు ఇక్కడినుంచి వెళ్ళండి. కళ్ళయెదుట మీరు ప్రేమించుకోవటం సహించలేను నేను" అన్నది జయ.

"చాటుగా ప్రేమించుకున్నా సహించలేవు"

"ఆ సంగతి వేరు"

అని జయ చటుక్కున ఆశ్చర్యపోయినట్లుంది. "ఏమనుకుంటున్నావ్ నువ్వు? ఏ ఉద్దేశంతో అన్నావ్ ఆమాట? నీకు తెలుసు కుముద్. నువ్విలా ఎన్నడూ ఆకర్షించలేదా నన్ను? అలాంటి ఆకర్షణ నాకెప్పుడూ లేదా నీ విషయంలో?"

కుముద్ కొంచెం తెల్లబోయి—"నాకు తెలుసా సంగతి. ఆ ఉద్దేశ్యాన్ని సూచించలేదు నేను. మేమువచ్చి మీ సంసారాన్ని భగ్నంచేసి వెళ్ళాం. కనుక మేము వెళ్ళిపోయినా నీ కీస్మృతి కలకాలమూ సెలవేస్తూ ఉంటుందంటున్నాను"

జయ కొంచెం నీరసంగా నవ్వి—"నువ్వు ఎంతచమత్కారంగా మాట్లాడుతావ్ కుముద్! ఇదిగో మతీ! రా, లోపలికిరా. విను ఏమంటున్నాడో! ఈ మాటలన్నీ అర్థంచేసుకోలేవు నువ్వు..." అన్నది...

మళ్ళీ ఇలుమార్చే హడావిడా? జయ, వాళ్ళని ఇక్కడ ఉండనివ్వదా? పోనీయ్. మంచిదే. రాత్రియింట్లో వాళ్ళు సుఖంగానే ఉంటారు. కోపంతో మతిముఖం ముడుచుకుపోయింది. ఏమిటో ఏంజరిగిందో పాపం ఆమెకేమీ అర్థంకాలేదు. కుముద్ వివరించినా తెలియలేదు. నీకు మేమేం అపరాధం చేశామో నీకే తెలియాలి తల్లీ! ఇది మంచిపనికాదు, ఇలా వెళ్ళకొట్టటం ఏమీ మంచిదికాదు. మనస్సులో పెట్టుకుంటానిది. కనిపించిన వాళ్ళకందరికీ చెపుతానులే" అన్నదామె జయతో.

"ఏంచెపుతావ్?"

"నువ్వెంత భయంకరమైనదానివో చెపుతా. నువ్వు మనస్సులో పెట్టుకునే దొకటి, పైకి అనేదొకటి. ఎంత అపేక్ష చూపించావ్! ఏమయింది ఆ అపేక్షంతా? నేనూ పట్టుదలగలదాన్నే. తెలియదేమో! నీ పేరు ఎత్తుతానేమో చూడు మళ్ళీ?"

"నా పేరు ఎత్తకుండా మరి నన్ను గురించి అందరికీ ఎలా చెపుతావ్?"

మతికి ఏడుపువచ్చేసింది. ఇంకేం మాట్లాడలేకపోయింది.

వనవిహారి గంభీర విషణ్ణముఖంతో సాయంత్రమే తిరిగి వచ్చాడు. ప్రొద్దున్న జరిగినదానికి వాళ్ళిద్దరిమధ్య మాటలు లేకుండా పోలేదని మతి గ్రహించింది. వచ్చి వనవిహారి భోజనమూ చేశాడు. జయచేతికేదో కొంతడబ్బూ యిచ్చాడు. వాళ్ళిద్దరిమధ్య తెలియని అగాధమేదో ఏర్పడినట్లుంది. ఇద్దరూ ఏదో క్రుంగిపోయినట్లున్నారు. ఎక్కడో ఇలుమాట్లాడి సాయంత్రానికి కుముద్ ఇంటికి వచ్చాడు. కుముద్‌తో మాట్లాడుతూ జయవచ్చి గుమ్మంలో నుంచుంది.

"మళ్ళీ ఎప్పుడైనావచ్చి కలుసుకుంటాంలే జయా!" అన్నాడు కుముద్.

"కలుసుకోగలమో లేదో ఏం చెప్పగలం?"

"మధ్యమధ్యవచ్చి కబురు కనుక్కోనా యేం?"

"కనుక్కో, కాని ఒక్కడివే రా"

మతి మనస్సులో నివురు కప్పిఉన్న కోపం ఒక్కసారి భగ్గుమంది. 'ఒక్కడివే రా' అట! జయ ఏమనుకుంటోంది? తనవిచ్చి కలుసుకుంటూ ఉండకపోతే మతికి అన్నంకూడా సయించదనుకుంటోందా? బండి బయలుదేరాక మతి కుముద్‌తో—"కబుర్లు తెలుసుకోటానికి మీ రెప్పుడూ రావద్దు చెపుతున్నా. ఆవిడ మనల్ని వెళ్ళకొట్టింది."

కుముద్ ఏం మాటాడలేదు. "ఆమె ఎంత స్వార్థపరురాలో నేను మొట్టమొదట వచ్చినప్పుడే తెలుసుకున్నా. మనం వచ్చే లోపుగా మంచివాటాని కాస్తా ఆక్రమించుకు కూచుంది" అన్నది మళ్ళీ మతి.

"అలాంటి స్వల్పవిషయాలు మనసులో పెట్టుకోకు మతీ!"

ఓ మూడంతస్తుల మేడలో రెండుగదులు అద్దెకి తీసుకున్నాడు కుముద్. వేరే ఓ వంటగదికూడా ఉంది. ఒక్కగదికి బదులు రెండుగదులు తీసుకోవటం హోదా పెరగటం! మతి చాలా సంతోషించింది.

ఇక్కడ జయ లేకపోవటం వల్ల కొన్నాళ్ళు మతికి మనసు ఎలాగో ఉండేది. కొన్ని కొన్ని విషయాల్లో జయమీద ఆధారపడటం అలవాటయిందామెకి. అయినా ఎప్పుడూ జయని గురించే ఆలోచనలు పెట్టుకునే వ్యవధి లేదు. తన అపరిమితానందంలో పుట్టింటి మాటే తలపెట్టటం లేదసలు. ఇలాంటి ఐహికమైన ఆలోచనలు, మామూలు మనుషులతోటి సఖ్యత—శత్రుత్వాలు అంత ప్రధానమైనవి కావు...కుముదునికి సంబంధించినంత వరకు తప్ప మిగతా విషయాల్ని గురించిన బెడదలు పెట్టుకోవటం ఏమిటి? అవన్నీ స్వల్పాతి స్వల్పాలు... (ఇంకా వుంది)

# ★ సుఖాంతమైన సంక్రాంతి ★

(23–వ పేజీ తరువాయి)

బామ్మ దిగింది! అంతక్రితమే లోపలి గుమ్మంలోవుంది కాబోలు రాధ గబగబా వచ్చి బామ్మని చుట్టేసింది తీగలా. ఇంతలో ఈ సందడికి అమ్మకూడావచ్చి గుమ్మంలో నించుంది. బామ్మని చూసేసరికి ఎందుకనో అందరికీ కళ్లలో నీళ్ళు తిరిగాయి. పైకి వినపడకపోయినా, బామ్మ కూడా ఏడ్చేసినట్టనిపించిందాక్షణంలో ఆమె ముఖం చూస్తే. చాలా చిక్కిపోయింది బామ్మ. మేలిమి బంగారంలావుండే ఆమె శరీరం నలబడిపోయింది. ఎప్పుడూ నవ్వుతున్నట్టుండే ఆమె ముఖం, సంతోష విషాదాలతో మిళితమై వెలవెల బోతున్నట్టుంది.

బామ్మ గుమ్మంలో అడుగు పెట్టిందో లేదో, అమ్మ ఆమెకు సాష్టాంగపడి క్షమించమని తన కన్నీటితో అడిగింది.

"అదేమిటే—పిచ్చిపిల్లా, లేలే!" అంది అమ్మను రెక్కపట్టుకు లేవదీస్తూ బామ్మ.

ఈ హడావుడికి, ఆఫీసుకు టైమయిపోయిందని త్వర త్వరగా స్నానం చేస్తున్న నాన్నగారు సగం ఒళ్ళుతుడుచుకోకుండానే నీళ్ళగదిలోంచి వచ్చేశారు. ఎదురుగా కనిపించింది బామ్మ. నాన్నగారుకూడా ఆమెకి నమస్కరించారు అశ్రుపూరితనయనాలతో.

బామ్మ, ఆశీర్వదించింది కాబోలు, సంతోషంగా కదిలాయి ఆమె పెదవులు.

సంక్రాంతి ఇంకో రోజున్నా ఆ నాడే మా యింట్లో పండుగలా అనిపించింది. అందరం అతిఉత్సాహంతో వున్నాం. తెలవారితే మామయ్యకూడా వస్తాడుగా మరి! ఇంక మా ఆనందానికి అంతేలేదు. అయితే మా మామయ్య సంగతినుకున్నప్పుడల్లా అత్తయ్య అదోలామారిపోయేది. ఇక మా రాధ చెప్పనే అక్కరేదు. బామ్మదగ్గర చేరి చిలకపలుకులు ప్రారంభించింది ఇంతలో వాకిట్లోంచి "అమ్మగారూ! పెద్దమ్మగారూ!" అన్న కేక వినిపించింది. అందరం ఒక్కసారి అటువేపు చూశాం. వాకిట్లో ప్రత్యక్షమయాడు బట్టల వర్తకుడు.!

బామ్మ అందరికీ బట్టలు కొనేసింది. ముఖ్యంగా మామయ్యకీ, అత్తయ్యకీ మంచి బట్టలు కొన్నది. కుట్టడానికివ్వాల్సిన బట్టల్ని మాయింటిపక్కనుండే దర్జీని పిల్చి ఇచ్చేసింది.

"ఏం అమ్మగారూ! ఇన్నాళ్ళు వేరాయ ముకాం? నేను మొన్నోసారి వస్తే లేరని చెప్పారు. పండగ రోజుల్లో వూరికెళ్ళి కూచున్నారేవిటి"? వర్తకుడు అడిగాడు.

"పండగముందే వచ్చేశాగా! మరి పన్లున్నప్పుడు వెళ్ళద్దూ?" అంది బామ్మ సమర్థించుకుంటూ.

"అదికాదండీ! ముందు మీరు బోణీచేస్తేనేమో ఈ పండగ రోజుల్లో గిరాకీలు బాగా తగుల్తాయని అనుకున్నాను. ఆశతో వచ్చి చూస్తే మీరు కనిపించలేదు. పైగా మీ యింట్లో అంతా అదోలా కనిపించారు. నిజంగా ఆ నాడు ఏడుపొచ్చిందంటే నమ్మండి! ఆఖరికి భోగిముందరొస్తానని చెప్పివెళ్ళిపోయా" అన్నాడు.

"సరేలే—పండగింకా అయిపోలేదుగా! గిరాకీలు తగుల్తాయలే!" అంది బామ్మఉత్సాహాన్ని కల్గిస్తూ.

నవ్వుతూ మూటబుజానేసుకుని వెళ్ళిపోయాడు అతను.

* * *

తెలవారుజామునే లేచాము. మా స్నేహితులంతా పోగయారు భోగిమంటవెయ్యడానికి. అందరం ఆ హడావిడిలో వుండిపోయాము తలంటి పోసుకోడానికి రమ్మని కబురొచ్చింది. ఇంటికి వెళ్ళాను ఇంటికి వెళ్ళేసరికి మా మామయ్యకూడా అప్పటికి వచ్చేశాడు. అందరంతలంటిపోసుకున్నాము. కొత్తబట్టలు కట్టుకున్నాము. రాధ కొత్త బట్టలు కట్టుకుని బామ్మకి దండం పెట్టింది. అమ్మ, అత్తయ్యకూడా అలాగే చేస్తారు. అందుకని అదికూడా అలానే చేసింది రాధ మునుపటి రాధ కాదిప్పుడు. ఎంతో బుద్ధిమంతురాల్లా మారిపోయింది బామ్మవచ్చాక! దాని ముద్దొచ్చే చేతులు రెండూ పట్టుకుని రాధని దగ్గరగా తీసుకుంటూ సంతోషంగా దీవించింది బామ్మ!.

అందరం ఎంత నిరుత్సాహాన్ని పొందామో అంతకు రెట్టింపు ఉత్సాహాన్ని కలించింది బామ్మ, మామయ్యల రాక. ఇంక మా రాధ సంగతి చెప్పనే అక్కరేదు. మామయ్య నాతో చాలా సర్దాగా వున్నారు. అత్తయ్య మాత్రం ఆనాట్నించీ గదిఒదిలి ఇవతల తిరగడమే మానేసింది.

భోజనాలయాక, అందరం వరండాలో కూచుని సర్దాగా కబురాడుకుంటున్నాము. మామయ్య గదిలో విశ్రమిస్తున్నారు, తెలవార్లూ ప్రయాణం చెయ్యడంచేత. ఇంతలో అక్కడికొచ్చారు నాన్నగారు రాధనెత్తుకుని. 'నామీద కోపం పోయిందే బామ్మా?' అని అడుగుతున్నారు రాధని.

రాధ, 'నామీద కోపం పోయిందిలే!' అని అక్తెగి, అమాంతం ఆయన చంకలోంచి దిగి బామ్మమీదికి దూకింది, అందరం నవ్వేశాం. ఆ సంతోషం పట్టలేక, పెద్దగా నవ్వింది బామ్మకూడా. అమ్మకూడా ఆనాడెంతో సంతోషంగా కనిపించింది నిజంగా ఆనాడు మా ఇల్లు కళకళలాడింది!

బామ్మ ఒళ్లో ఒదిగి ఒదిగి కూర్చుంటున్న రాధని చూసి అప్పుడే అక్కడి నుంచి లేస్తూన్న అత్తయ్య వెక్కిరించింది; 'మా అమ్మ ఒళ్ళోనుంచి లేచిపో!' అని. బామ్మ రాధవేపు చూచింది ఏమిటీ అన్నట్టు. రాధ కళ్ళు చిన్నవిచేసి, అత్తయ్యను మళ్ళీ వెక్కిరించి, బామ్మమెడ పట్టుకుని గట్టిగా కౌగలించుకుంది ఉత్సాహంగా!

* * *

ఆ సంక్రాంతి పండుగ, ఆదిలో మా అందర్నీ అలమటింపజేసినా, ఆఖరికి ఆనందోత్సాహాలు వెలివిరియజేసి వెళిపోయింది. ★

## తక్కువఖర్చులోనే ఎక్కువహోదాలు

(54 వ పేజి చూడుడు)

కుట్టి, లంగా, వోణీ, చోళీకుట్టుకుని, కట్టుకుచూద్దునుకదా? బలే బాగున్నాయి అందంగా. ఎప్పుడన్నా, కట్టుకొనవచ్చుని పెట్టిలో పెట్ట, మొన్న మా వాళ్ళింట్లో కట్టుకున్నాను. ఫలానావిధంగా కుట్టాను అని చెబితే, అందరూ చాలా ఆశ్చర్యపోయారు. నిజంగా ఇంటికి వచ్చినవారు, మేం కట్టుకున్న గుడ్డలు, మా ఇంట్లో, గుమ్మాలకు, కుర్చీలకు, కిటికీలకు, వుపయోగించే గుడ్డలుచూసి. అవి ఎంతో ఖరీదైన వనుకుంటారు కాని అవన్నీ చిరిగిన గుడ్డల్ని నేనూ మా అక్క కలసి పొదుపుచేసి రకరకాలుగా రంగు రంగులుగా కుడతాము. మా ఇంట్లో (మగవారి పేంట్సుతప్ప) ఏ ఒక్క బట్ట టైలరు ముఖంచూడదు. ఆఖర్కి కత్తిరింపు గుడ్డలు, ఇంకా చీరల అంచులు భ్రాకత్రి చేసి రంగు రంగులుగా అతికి రకరకాల పేర్పు ఇంకా అన్నీ తయారుచేస్తాం, ఇవన్నీ చూస్తే అందరూ ఎంతో ఖరీదైనవనుకుంటారు కానీ, అవన్నీ కానీఖర్చులేకుండా కాసేపు తీరిగా కూర్చుని తయారుచేయచ్చు. పాతగుడ్డలు, పనికిరాని గుడ్డలు పొదుపుచెయ్యచ్చు. కాసేపు తీరిగా కూర్చుంటే రకరకాలుగా చూపే వార్ని ఆకర్షించేటుట్టుకొనవచ్చు. తక్కువ ఖర్చుతోనే ఎక్కువ హోదా నిలబెట్టుకోవచ్చు.

ఎల్. వి. సత్యవతీదేవి, బొమ్మూరు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



సిద్ధుడు

—ఫొటో : ఎస్. పరశురాం, నాసిక్.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
## ఈ కొంటె బాలుడైన విజయుడు తన తండ్రి షర్టు తొడిగాడు.




హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి.

260-X52 TL